శ్రీమతే రామానుజాయ నమః



# నారాయణసూక్త వ్యాఖ్యానమ్

## శ్రీమాన్, డా॥ ఈ.ఏ. శింగరాచార్యులు

మహావిద్వాన్ ఉ.వే. శ్రీమాన్
ఈయుణ్ణి శేషశింగరాచార్య స్వామివారి
121వ తిరునక్షత్రోత్సవ పవిత్ర జ్ఞాపిక
**23-4-2019**

# నారాయణసూక్త వ్యాఖ్యానమ్

శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యులు

ప్రథమముద్రణము : ఏప్రిల్, 2019

ప్రతులు : 300



ముఖచిత్రము : శ్రీ ఆదికేశవస్వామి, నరసాపురం

మహావిద్వాన్ ఉ.వే. శ్రీమాన్
ఈయుణ్ణి శేషశింగరాచార్య స్వామివారి
121వ తిరునక్షత్రోత్సవ పవిత్ర జ్ఞాపిక

అక్షరయోజనము : శ్రీమతి జయలక్ష్మి, తిరుపతి
శ్రీచంద్రశేఖర్, తిరుపతి

ముద్రణ : సి.యన్. ప్రింటర్స్, తిరుపతి



## విజ్ఞప్తి

అస్మత్పితామహచరణులు ఉభయవేదాంతమహావిద్వాన్, ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్యస్వామివారి తిరునక్షత్రోత్సవ సందర్భంలో ప్రతి ఏడు అభినవ భూతపురిగా ప్రసిద్ధి చెందిన నరసాపురంలో ఉభయవేదాంత సభానిర్వహణం, సంప్రదాయగ్రంథ ప్రకాశన మనే రెండు కైంకర్యాలు వారి ముఖోల్లాస కైంకర్యరూపంగా గడచిన ఇరవై సంవత్సరాలుగా అనుస్యూతంగా నిర్వహింపబడుతున్నాయి. ఈ ఏడు ఏప్రియల్ 23వ తేదీన జరుగబోయే వారి తిరునక్షత్రోత్సవాలలో గ్రంథప్రకాశన కైంకర్యంగా నారాయణసూక్త వ్యాఖ్యానమనే ఈ లఘు గ్రంథం ముద్రింపబడుతున్నది. ఈ వ్యాఖ్యానం, శ్రీసుదర్శన తమిళమాస పత్రికకు సంపాదకులు, పరమపదవాసులు, శ్రీవైష్ణవసింహ ఉ.వే.శ్రీమాన్. ఎస్. కృష్ణస్వామి అయ్యంగార్‌స్వామివారు తమిళంలో రచించి ముద్రించిన శ్రీవిష్ణుచిత్త విజయమనే గ్రంథంలోని నారాయణసూక్త నిర్ణయమనే భాగానికి ఆంధ్రానువాదరూపం. శ్రీమాన్ కృష్ణస్వామి అయ్యంగార్ స్వామి వారు పంచసూక్తాలు, దశోపనిషత్తులు, సుబాల, శ్వేతాశ్వతర, కౌషీతకి, నృసింహతాపిని, గోపాలతాపిన్యాది ఇతర ప్రసిద్ధోపనిషత్తులు, స్మృతులు శ్రీరామాయణం - అన్నీ విష్ణుపరత్వ ప్రతిపాదకాలే అనే సత్యాన్ని సప్రమాణంగా, చక్కగా నిరూపించారు. ఆ ప్రయత్నంలోనే వారు నారాయణ సూక్తాన్ని కూడా వ్యాఖ్యానించారు. దివ్యసూరి సూక్తులను ఆయా మంత్రాలను వ్యాఖ్యానించేటప్పుడు ప్రమాణీకరించడం ఈ వ్యాఖ్యానంలోని విశేషం.

ప్రతిసంవత్సరం ప్రచురించబడే సంప్రదాయగ్రంథాలవలెనే ఈ గ్రంథం కూడా పెద్దలను విజ్ఞులైన ఆస్తిక పాఠకులను ఆనందింపజేయ గలదని నమ్ము తున్నాను. స్వస్తి.

నారాయణాఖ్యసూక్తస్య వ్యాఖ్యైషా సంప్రకాశ్యతే ।
గుణగ్రహణ పారీణచిత్తాన్యానందయేదితి ॥

నరసాపురం
2-4-19

భాగవతవిధేయుడు
ఈ.ఏ. శింగరాచార్యులు



శ్రీమతే రామానుజాయ నమః

# నారాయణసూక్త వ్యాఖ్యానమ్

## అవతారిక

శ్రీమన్నారాయణస్వామివైభవం యేన కీర్త్యతే ।
సూక్తం నారాయణాఖ్యమ్ తత్ ముదే వ్యాఖ్యాయతే విదామ్ ॥

నారాయణసూక్తం యజుర్వేదంలోని తైత్తిరీయోపనిషత్తులో పఠింపబడుతున్నది. తైత్తిరీయనారాయణవల్లిలో ఇది ఒక అనువాకం. ఈ తైత్తిరీయనారాయణవల్లిలో **"అద్భ్య స్సంభూతో హిరణ్యగర్భ ఇత్యష్టౌ"** అని ''అద్భ్యః సంభూతః'' అనే మంత్రంనుండి ఆరంభమయే పురుషసూక్తంలోని ఉత్తరానువాకం పఠింపబడాలని విధింపబడినందున, అక్కడ చెప్పబడ్డ శ్రీభూమీనాథుడైన పురుషుడు నారాయణుడే- అని ఇక్కడ నిర్ణయింప బడుతున్నది. పురుషసూక్తంలో భగవానుడు పురుషశబ్దంచేత చెప్పబడినా, శ్రీభూమీ నాథుడని ఉద్ఘోషింపబడినా, ఆ స్వామి అసాధారణనామమైన నారాయణ నామం అక్కడ చెప్పబడలేదనే లోటు ఒకటి ఉన్నది. ఆ కొఱత ఇక్కడ తీర్చబడింది. దీనికి ముందున్న అనువాకంలో దహరవిద్య ప్రస్తావింప బడింది. దాని చివరలో **"యద్వేదాదౌ స్వరః ప్రోక్తో వేదాంతే చ ప్రతిష్ఠితః, తస్య ప్రకృతిలీనస్య యః పరః స మహేశ్వరః"** (వేదారంభంలో ఏ స్వరం ఉచ్చరింపబడుతున్నదో, తనకు కారణమైన అకారంలో ఒదిగిన - లీనమైన - ఆ ఓంకారానికి అంతర్యామియై ఉండేవాడే సర్వేశ్వరుడు) అని అకారవాచ్యుడైన అచ్యుతుడే సర్వేశ్వరుడని తెలుపబడింది. ఇంతటితో తృప్తి చెందకుండా,



పరబ్రహ్మంయొక్క సాటి లేని నామాన్ని నిర్దేశించి వేదం ఇక్కడ నిర్ణయిస్తున్నది. ఇంతేకాక, వేదంలోని పలు విద్యలలో పరవస్తువును ఉద్దేశించి శివుడని, శంభువని, హిరణ్యగర్భుడని, పరబ్రహ్మమని, పరమాత్మ అని, పరంజ్యోతి అని, పరతత్త్వమని చెప్పబడిన శబ్దాలు నారాయణునే నిర్దేశిస్తున్నాయి- అని ఇక్కడ ఘోషింపబడుతున్నది. దీనినే **"వేదై శ్చ సర్వైరహ మేవ వేద్యః"** (అన్ని వేదాలచే తెలియబడేవాడను నేనే) అని గీతాచార్యుడు పలికాడు. **"ఓదువార్ ఓత్తెల్లామ్ ఎవ్వులకత్తు ఎవ్వైవైయుమ్ శాదువాయ్ నిన్ పుకழ్ిన్ తకైయల్లాల్ పిఱిదిల్లై"** (ఆయా శాఖలకు చెందిన వారిచే అధ్యయనం చేయబడే వేదాలన్నీ అన్నిలోకాలలో పలు శాఖావేదాలను కలిగినవై, యథార్థాన్ని తెలిపేవై నీ కల్యాణ గుణాలను ప్రకారాలను తెలుపుతున్నవి తప్ప వేరుకాదు.) అని ఈ విషయాన్ని నమ్మాళ్వార్లు కూడా అనుగ్రహించారు. **"మఱైయాయ నాల్ వేదత్తుళ్ నిన్ఱ మలర్చ్చుడర్"** (వేదంలో ప్రకాశించే జ్యోతిస్సు) అయిన మాధవుడే; నాస్తికులై, దుష్ప్రకృతిని కలవారై, బాహ్యులై, కుదృష్టులై ఉండేవారికి తన అర్థాన్ని గోచరింపజేయకుండా మఱుగుపరుస్తున్నందున **"మఱై"** అని చెప్పబడుతున్నది వేదం. ఆ వేదం సత్, బ్రహ్మం, ఆత్మ, ఇంద్రుడు, శంభువు, శివుడు, రుద్రుడు, ప్రజాపతి మొదలైన సామాన్య శబ్దాలతో పరమపురుషుని కొన్ని చోట్ల నిర్దేశించడం ద్వారా ముందు చెప్పిన నాస్తిక, బాహ్య, కుదృష్టివాదాదులను భ్రమింపజేస్తున్నది. అందువల్ల, కొందఱు ప్రకృతే జగత్కారణమని భ్రమపడుతున్నారు. ఇంకా కొందఱు బ్రహ్మరుద్రేంద్రాదులే పరతత్త్వమా! అని భ్రమిస్తున్నారు. అచేతనప్రకృతి, బ్రహ్మరుద్రేంద్రాదులు నారాయణుని వద్దనుండే పుడుతున్నారని వేదంలో ఉద్ఘోషింపబడడాన్ని భగవానుని మాయవల్ల తెలిసికోలేక భ్రమించి, తత్త్వాన్ని గ్రహించలేక

పోతున్నారు. **“పోఱ్ఱి మఱ్ఱోర్ దెయ్వమ్ పేణ పుఱత్తిట్టుమ్మై ఇన్నే తోఱ్ఱి వైత్తదు ఎల్లీరుమ్ వీడు పెఱ్ఱాల్ ఉలకిల్లై యెన్డే”** (దేవతాంతరాలను స్తుతించి ఆశ్రయించేటట్లు మిమ్ములను భగవానుడు ఈవిధంగా దూరం చేయడం - అందఱు మోక్షాన్ని పొందితే ఈ లోకం ఉండదు అనికదా) అని నమ్మాళ్వార్లు తిరువాయ్‌మొళిలో పలికారు. పురుషోత్తమునే శరణంగా ఆశ్రయించిన మహానుభావులకు యథార్థ తత్త్వాన్ని తెలియజేయడం ద్వారా వేదమనే కీర్తిని వేదం పొందింది. **“దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా, మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే”** (సత్త్వం, రజస్సు, తమస్సు - అనే మూడు గుణాలను కల్గినది, నాకు చెందినది అయిన మాయ అనే ప్రకృతి దాటడానికి సాధ్యం కానిది. నన్ను శరణు పొందిన వారే ఈ మాయను దాటగల్గుతున్నారు) అని శ్రీకృష్ణభగవానుడన్నాడు. మహాత్ములు, పూర్వం తెల్పిన సామాన్యశబ్దాలు, విశేషశబ్దమైన నారాయణ శబ్దంలోనే పర్యవసిస్తున్నాయనే విషయాన్ని తెలియగల్గుతున్నారు. బ్రహ్మ, ఇంద్రుడు, శివుడు మొదలైన శబ్దాలు పురుషోత్తముని నామాలే. అతడు, తన నామాలైన వానిని తనచే సృష్టింపబడిన కొందఱికి అనుగ్రహించడం వల్ల వారినే ఆ శబ్దాలు నిర్దేశిస్తున్నాయా!- అనే సందేహం కొందఱికి కలుగవచ్చు. ఆ సందేహాన్ని తీర్చడంకోసం ఇక్కడ ఎనిమిదిమార్లు నారాయణ నామాన్ని మాటి మాటికి పఠించడమేకాక, ఆ స్వామి నామాంతరాలైన హరి, అచ్యుత, అనంత- అనే నామాలను కూడా వేదం పఠించింది.

**“న తు నారాయణాదీనాం నామ్నా మన్యత్ర సంభవః, అన్యనామ్నాం గతిర్విష్ణు రేక ఏవ ప్రకీర్తితః, ఋతే నారాయణాదీని నామాని పురుషోత్తమః, ప్రాదాదన్యత్ర భగవాన్....”** (నారాయణాది నామాలు అన్యదైవాలను



నిర్దేశించవు. మిగిలిన దైవాల నామాలతో విష్ణువు ఒక్కడే గతిగా కీర్తింపబడుతున్నాడు. నారాయణాదినామాలను తప్ప అన్యనామాలను పురుషోత్తముడు ఇతరులకు ఇచ్చాడు) అనే వామనపురాణ వచనం ఇక్కడ అనుసంధేయం. ఈ విధంగా నారాయణుడే పరమాత్మ -అని నిర్ణయించి, అతని మహిమను తెల్పుతున్నందున ఇది నారాయణ సూక్తమని కీర్తింపబడుతున్నది. పురుషసూక్తంలో సృష్టిక్రమం తెలుప బడింది. నారాయణసూక్తంలో నారాయణుని రక్షణక్రమం, ఉపాసనా క్రమం, నారాయణుని పరత్వం, అతడు సర్వాంతర్యామియై ఉండే స్వభావం తెలుపబడుతున్నాయి. లింగభూయస్త్వాధికరణంలో వ్యాస భగవానులు అన్ని పరవిద్యలలోను ఉపాసింపబడేవాడు నారాయణుడే- అని ఇక్కడ నిర్ణయింపబడినదని సిద్ధాంతీకరించారు.



**1. సహస్రశీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువమ్ ।
విశ్వం నారాయణం దేవమక్షరం పరమం ప్రభుమ్॥**

వేయి శిరస్సులను కలవాడు, ప్రకాశించేవాడు, అంతట నేత్రాలను కలవాడు, లోకానికి అంతటికి మంచిని చేసేవాడు, లోకమై ఉండేవాడు, ఆ విధంగా ఉన్నా, దోషవిదూరుడు, నాశం లేనివాడు, గొప్పవాడు, స్వామి అయినవాడు నారాయణుడే.

ఇక్కడ **“సహస్రశీర్షమ్”** ఇత్యాది శబ్దాలలోని ద్వితీయావిభక్తి ప్రథమావిభక్త్యర్థంలో ప్రయోగింపబడినదని గ్రహించాలి. ఇక్కడే **“విశ్వ మేవేదం పురుషః”** అని, **“నారాయణః పరః”** అని పలు చోట్ల ప్రథమావిభక్తి లోనే శబ్దాలు పఠింపబడుతున్నాయి కదా! ఈ విషయాన్ని గూర్చి లింగభూయస్త్వాధికరణ శ్రీభాష్యంలో, శ్రుతప్రకాశికలో విస్తృతంగా

గమనించవచ్చు.

"న చ సహస్రశీర్ష" మిత్యాది ద్వితీయానిర్దేశేన పూర్వానువాకోదితో పాసినా సంబంధశ్శంకనీయః, "తస్మిన్ యదంతస్తదుపాసితవ్యమ్" ఇచ్యుపాసిగతేన కృత్రప్రత్యయేనోపాస్యస్య కర్మణోభిహితత్వాత్ తదు పాస్యే ద్వితీయానుపపత్తేః. విశ్వమేవేదం పురుషః", "తత్త్వం నారాయణః పరః" ఇత్యాది ప్రథమానిర్దేశాచ్చ ప్రథమార్థే ద్వితీయా వేదితవ్యా. "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః', "తస్యా శ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః, సబ్రహ్మా స శ్శివస్సేంద్రః సోక్షరః పరమః స్వరాట్" ఇతి నిర్దేశైః సర్వస్మాత్ పరో నారాయణ ఏవ సర్వత్రోపాస్య ఇతి నిశ్చీయమానత్వాచ్చ ప్రథమార్థే ద్వితీయేతి నిశ్చీయతే"

("సహస్రశీర్షమ్" ఇత్యాది పదాలలో ద్వితీయావిభక్తి ప్రయోగింప బడినందున, పూర్వానువాకంలోని "ఉపాసితవ్యమ్" అనే ప్రథమాంత పదంతో వీనికి సంబంధమున్నదని భావించరాదు. "తస్మిన్ యదంతః తదుపాసితవ్యమ్" అనే కృదంతపదంలోని తవ్యప్రత్యయంచేత ఉపాస్యవస్తువు కర్మణి ప్రయోగంలో చెప్పబడింది. అందువల్ల అది ద్వితీయాంత పదం కాదు, ప్రథమాంతమే. తరువాత "విశ్వమేవేదం పురుషః" అని, "తత్త్వం నారాయణః పరః" అని మొదలైన వాక్యాలలోని పదాలు ప్రథమావిభక్తిలో ఉన్నాయి. అందుచేత "సహస్రశీర్షమ్" ఇత్యాదిగా ఉండే పదాలలోని ద్వితీయావిభక్త్యంతపదాలను ప్రథమాంతాలుగానే గ్రహించాలి. అంతేకాక, "అంతర్బహిశ్చ తత్ సర్వం వ్యాప్య నారాయణః స్థితః" - నారాయణుడు లోపల బయట అంతటా వ్యాపించి ఉన్నాడు, "తస్యా శ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః స బ్రహ్మా స శివః సేంద్రః సోక్షరః పరమః స్వరాట్" (తేజశ్శిఖారూపమైన ఆదివ్యమంగళవిగ్రహం



మధ్యలో పరమాత్మ ఉన్నాడు. అతడు బ్రహ్మకు, శివునకు, ఇంద్రునకు అంతర్యామి. అతడు కర్మవశ్యుడుకాడు. ముక్తునకు కూడా అంతర్యామి) అనేవ్యాక్యాల వల్ల పరమాత్మ అయిన నారాయణుడే అంతటా ఉపాసించదగినవాడని నిర్ణయింపబడినందున "సహస్రశీర్షమ్" ఇత్యాదిపదాలలోని ద్వితీయావిభక్తి ప్రథమావిభక్త్యర్థంలో వచ్చిందని తెలియాలి) అనేది శ్రీభాష్యంలోని వివరణం.

**(సహస్రశీర్షమ్)** - వేయి శిరస్సులను కలవాడని అర్థం. ఇక్కడ "శీర్ష" శబ్దం పాదాలు, హస్తాలు మొదలైన అన్యాంగాలకు ఉపలక్షణం. ఇందువల్ల అనంతమైన జ్ఞానశక్తులను కలవాడని చెప్పబడింది. గీతలోని విశ్వరూపదర్శనంలో చూపబడిన రీతిలోని దివ్యమంగళవిగ్రహాన్ని కలవాడని కూడా అర్థాన్ని గ్రహించవచ్చు. ఇందువల్ల పురుషసూక్తంలో చెప్పబడినవాడే ఇక్కడ నారాయణుడని నిర్ణయింపబడుతున్నాడని తెలుస్తున్నది.

**(దేవమ్)** - ప్రకాశించేవాడు - అని అర్థం. "ముడిచ్చోదియాయ్ ఉనదు ముకచ్చోది మలర్న్దదువో, అడిచ్చోది నీ నిన్ఱ తామరైయా యలర్న్దదువో !, పడిచ్చోది ఆడైయొడుమ్ పల్కలనాయ్ నిన్పైమ్బొన్ కడిచ్చోది కలన్దదువో తిరుమాలే! కట్టురైయే" (శ్రియఃపతీ! నీ ముఖకాంతి కిరీటకాంతిగా వికసించిందా? నీ శ్రీపాదకాంతి నీవు నిలచిన తామర పూవుగా వికసించిందా? వ్యాపించిన శోభనుకల నీ కటికాంతి సహజ కాంతిని గల పీతాంబరంతో పలు దివ్యాభరణాలుగా కలసినదా? తెలుపు) అని నమ్మాళ్వార్లచే వర్ణింపబడిన తేజోమయమైన రూపాన్ని కలవాడు.

**(దేవమ్)** - లోకాన్ని సృష్టించి, రక్షించి, సంహరించడం లీలగా కలవాడు- అనే అర్థాన్ని కూడా చెప్పవచ్చు.

**(విశ్వాక్షమ్)** - **"సహస్రాక్షః"** అని పురుషసూక్తంలో చెప్పబడిన విషయం దీనిచే స్మరింపజేయబడుతున్నది. అన్నిటిని తెలిసినవాడని తాత్పర్యం. **"ఉళ్ళువారుళ్ళిఱ్ఱెల్లామ్ ఉడనిరున్దఱిది యెన్ఱే, వెళ్కిప్పోయ్ ఎన్నుళ్ళే నాన్ విలవఱ చ్చిరిత్తిట్టేనే"** (నిన్ను ధ్యానించేవారి మనస్సులోని అభిప్రాయాన్ని వారిలోఉండి గ్రహిస్తావు) అని తొండరడిప్పొడియాఴ్వార్లు అన్నారు. **"విశ్వత శ్చక్షురుత విశ్వతో ముఖో విశ్వతో హస్త ఉత విశ్వతస్పాత్"** (అంతటా కన్నులను, ముఖాలను, చేతులను, కాళ్ళను కలవాడు) అని నారాయణవల్లిలోని ప్రథమానువాకంలో పఠింపబడిన విషయం ఇక్కడ అనుసంధేయం. అంతటా నేత్రాలు, ముఖాలు, చేతులు, కాళ్ళు మొదలైనవి చేసే కార్యాలను చేయగల్గిన శక్తిని కలవాడు- అనేది దీని సారార్థం.

**(విశ్వాక్షమ్)** - లోకాలకు అన్నిటికి నేత్రాలు మొదలైన సకలేంద్రియ భూతుడుగా ఉండేవాడనే అర్థాన్ని కూడా గ్రహించవచ్చు. **"చక్షు ర్దేవానా ముత మర్త్యానామ్"** (దేవతలకు - నిత్యసూరులకు, మానవులకు నేత్రభూతుడై ఉండేవాడు) అని వేదం ఈ అర్థాన్ని ఉద్ఘోషించింది. **"కణ్ణావాన్ ఎన్టుమ్ మణ్ణోర్ విణ్ణోర్క్కు"** (భూలోకవాసులకు, పరమపద వాసులకు నేత్రస్థానీయుడు) అని వేదాన్ని ద్రావిడీకరించిన **"వేదమ్ తమిఴ్ శెయ్ద మాఱన్"** (వేదాలను ద్రావిడీకరించిన నమ్మాఴ్వార్లు) అన్నారు. నేత్రాలు లేకపోతే కార్యాలను నిర్వహించడం ఎంత అసాధ్యమో, ఆ రీతిలోనే నిత్యసూరులతో, నిత్యసంసారులతో తేడా లేకుండా, అందఱికీ ఇతడు లేకపోతే, ఏమీ చేయడం సాధ్యం కాదు. **"నమ్ కణ్ణన్ కణ్ణల్లదు ఇల్లైయోర్ కణ్ణే"** (మన శ్రీకృష్ణుడే నిర్వాహకుడు, వేఱొక నిర్వాహకుడు లేడు) అనేది దివ్యసూరివచనం.

**(విశ్వశంభువమ్)** - లోకాలకు అన్ని విధాలైన మంచిని ఇచ్చేవాడు- అని అర్థం. ఇందువల్ల అధర్వశిఖలో చెప్పబడిన పరమాత్మ ఇతడే- అని



చూపబడింది. **"విశ్వశంభువమ్"**- అని అన్నందున లోకంలో **"శంభుః"** అని ప్రసిద్ధుడైన శివుడు ఈ లోకంలో కొందఱికి మాత్రం కొన్ని హితాలను మాత్రమే ఇవ్వగలడు. ఇతడయితే, అన్ని లోకాలకు అన్ని విధాలైన హితాలను ఇస్తాడు - అని తెలుపబడుతున్నది. పరమపురుషార్థమైన మోక్షాన్ని ఇతడు తప్ప వేఱు ఏ దైవం ఇవ్వగలదు? **"మమ మాయా దురత్యయా"** (నా మాయ దాటరానిది) అని అతనిచే చెప్పబడిన మాయను అతడు తప్ప వేఱెవడు దాటించగలడు? ఒక పిచ్చుక అల్లిన గూడునే విప్పడం మనకు సాధ్యం కానపుడు, ఇక, సర్వశక్తి అయిన భగవంతుడు అల్లిన ఈ గూడును విప్పడం మనకు సాధ్యమా? అతనినే ఉపాయంతో ఆశ్రయిస్తేనే జన్మ అనే మహాసముద్రాన్ని దాటి ఆవలి తీరాన్ని చేరగలం. **"అథ సోభయంగతో భవతి"** (తరువాత అతడు భయం తీరినవాడవుతున్నాడు) అని వేదం అంటున్నది. **"అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ"** (నన్ను శరణు పొందినవానికి సమస్తప్రాణుల వల్ల అభయాన్ని ఇస్తాను. ఇది నా వ్రతం.) అని అన్నాడు శ్రీరాముడు. స్వామియే కదా సొత్తును విడువలేని బంధాన్ని కల్గి ఉంటాడు. కన్నతల్లి మనస్సు పిచ్చిది కదా ! **"నమ్ అరఙ్గనాయ పిత్తనై ప్పెఱ్ఱుమ్ అన్దో! పిఱవియుళ్ పిణఙ్గుమాఱే"** (శ్రీరంగనాథుడనే, భక్తవ్యామోహం కలవానిని స్వామిగా పొందినా, అయ్యో! ఈలోకం జన్మలలో చిక్కు కొంటున్నదే!) అని అన్నారు, తొండరడిప్పొడియాఴ్వార్లు. ఆ వాత్సల్య గుణంవల్లనే మనకు కరణకళేబరాలను ఇచ్చి, శాస్త్రాలను ప్రదానం చేసి, పలు అవతారాలను ఎత్తి, మనలను సంస్కరించి, మననుండి కైంకర్యాన్ని స్వీకరించాలని పడరానిపాట్లు పడుతున్నాడు. అయితే మనం **"పిళ్ళైమనమ్ కల్లు"** (కుమారుని మనస్సు రాయి) అనే రీతిలో ఇనుము వలె కఠినమైన మనస్సును కల్గి, మనస్సు అనే తలుపును అతడు మనలను సమీపించలేనట్లుగా మూసి వేసి, పలు విధాలైన మాయలతో కూడిన జన్మలలో పడి పరిభ్రమిస్తున్నాము. అపుడుకూడా మనకు తగిన

దండలను ఇవ్వడంద్వారా మనకు హితాన్నే శ్రీధరుడు చేస్తాడు. ఈ విషయాన్ని నమ్మాళ్వార్లు. **"ఏ పావమ్ పరమే ! ఏఴులకుమ్ ఈ పావమ్ శెయ్‌దు అరుళాల్ అళిప్పారార్? మా పావమ్ విడ అరఱ్కు పిచ్చెపెయ్ కోపాలక్కోళరి ఏఱన్ఱియే" (2-2-2)** (ఏమి పాపం! ఇది కూడా చెప్పవలసి వచ్చిందే! ఏడు లోకాలను పాపాలు పోగొట్టి కృపతో రక్షించేవారు, గొప్పపాపం వీడిపోయేటట్లు శివునకు భిక్షపెట్టిన గోపాలసింహం కంటే వేరెవరున్నారు?) అని పలికారు. ఈ విధంగా మనకోసం అతడు పడరాని పాట్లు పడడానికి కారణం ఇక తెలుపబడు తున్నది.

**(విశ్వమ్)** - ఈ లోకం అంతా శరీరంగా కల్గి ఉన్నందున **"ఉలకమ్" (విశ్వమ్)** అని చెప్పబడేవాడు. తన శరీరాన్ని రక్షించని శరీరి అనేది ఒకటి ఉంటుందా ? **"విశ్వం త్వయ్యభిమన్యసే జగదిషే తేనాద్వితీయస్తతః"** (లోకాన్ని అంతటిని నీవు తానుగానే అభిమానిస్తున్నావు. అందువల్ల లోకం కంటే జగత్తు అద్వితీయుడవుగా- వేఱు కాని వాడవుగా- చెప్పబడు తున్నావు) అని వేదతాత్పర్యవిదులైన పరాశరభట్టర్ అన్నారు. విష్ణుసహస్ర నామస్తోత్రంలో కూడా మొదటి నామం. **"విశ్వ"** మనేదే. అక్కడ **"విశ్వమ్ విష్ణుః"** అని చెప్పబడగా ఇక్కడ **"విశ్వమ్ నారాయణమ్"** అని చెప్పబడింది. శరీరాన్ని నిర్దేశించిన తరువాతకదా శరీరిని గూర్చి పలకాలి.

**(నారాయణం దేవమ్)**- "సహస్రశీర్షం దేవమ్" అని చెప్పబడిన వాడెవడు? అనే విషయాన్ని నిస్సందేహంగా నిర్ణయించి పల్కుతున్నది.

**(నారాయణమ్)** - నారసమూహాలకు నివాసస్థానమై ఉండేవాడు అని - నారసమూహాలను నివాసస్థానంగా కల్గినవాడనే అర్థాన్ని గ్రహించాలి ఇందువల్ల, అన్నిటిని ధరించేవాడని, అన్నిటిలోను వ్యాపించి ఉండేవాడని తెలుస్తున్నది. అయనశబ్దం ప్రాప్యాన్ని, ఉపాయాన్ని తెల్పుతుంది కనుక,



చేతనులచే మోక్షంలో పొందబడేవాడని, మోక్షోపాయమై ఉండేవాడనే అర్థం స్ఫురిస్తుంది. **"శరణం గతి ర్నారాయణః"** (శరణం, ఉపాయం-నారాయణుడే) అనికదా వేదం పల్కింది.

**"నారశబ్దేన జీవానాం సమూహః ప్రోచ్యతే బుధైః, గతి రాలంబనం తస్య తేన నారాయణః స్మృతః"** (నారశబ్దం చేత జీవసమూహం పెద్దలచే చెప్పబడుతున్నది. దానికి ఉపాయంగా, ఉపేయంగా ఉన్నందున భగవానుడు నారాయణుడని చెప్పబడుతున్నాడు) అనే ప్రమాణం ఇక్కడ అనుసంధేయం. **"ఆపో నారా ఇతి ప్రోక్తాః ఆపో వై నరసూనవః, తా యదస్యాయతనం పూర్వం తేన నారాయణః స్మృతః"** (జలం నారమని చెప్పబడుతున్నది. జలం నరుడనబడే పరమాత్మనుండి ఉద్భవించింది కదా! ఆ జలం ప్రళయకాలంలో ఇతనికి నివాసస్థానమై ఉన్నందున నారాయణుడని చెప్పబడుతున్నాడు) అని మనుస్మృతిలో చెప్పబడిన క్రమంలో అర్థాన్ని గ్రహించవచ్చు. **"నరాజ్జాతాని తత్త్వాని నారాణీతి తతో విదుః, తాన్యేవాయతనం తస్య తేన నారాయణః స్మృతః"** (అన్ని వస్తువులు నరుడనబడే సర్వేశ్వరునినుండి పుట్టినవి. అందుచేత వానిని నారాలని అంటారు. వాటినే తనకు నివాసస్థానంగా కల్గినవాడు కనుక నారాయణుడని సర్వేశ్వరుడు చెప్పబడుతున్నాడు) అనే వచనానుసారంగా అర్థాన్ని చెప్పవచ్చు. ఇవి అన్నీ పెరియవాచ్చాన్‌పిళ్ళై అనుగ్రహించిన పరన్దరహస్యం అనే గ్రంథంలో తెలుపబడ్డాయి. కనుక, నారాయణుడు అన్నిటిని ధరిస్తాడని, సర్వవ్యాపి అని, సర్వకారణుడని, సకల చేతనులకు ఉపయోపేయమై ఉండేవాడని తెలుస్తున్నది.

**(దేవమ్)** - ఈ లోకం అంతా తన శరీరంగా గ్రహించి, వ్యాపించి ఉన్నా, వీటి దోషాలు ఏమీ తనపై పడకపోవడమే కాక, వీటిని నియమించడం వల్ల ఏర్పడిన తేజస్సును, కాంతిని కలవాడు. మొదట

**"దేవమ్"** అని అన్నందున అతడు అందమైనవాడని చెప్పబడింది. ఇక్కడ అతడు అమలుడని చెప్పబడింది. **"అ*ళ*కన్"** (అందగాడు) అని పెరియాళ్వార్లు అన్నారు. **"అమలన్"** (దోషప్రతిభటుడు) అని అన్నారు, తిరుప్పాణ్ఆళ్వార్లు. **"నమక్కుమ్ పూవిన్మిశై నఙ్గైక్కుమ్ అన్బన్"** (మనకు, లక్ష్మీదేవికి వల్లభుడు) అని నమ్మాళ్వార్లు అన్నారు. అందమైన వాడై, ప్రియుడై, అమలుడై ఉండేవాడు అచ్యుతుడని ఈ విధంగా వేదం తెల్పుతున్నది. ఆ విధంగా ఉన్నా, విధిశివసనకాదులవలె నాశం కలవాడై ఉన్నాడా? అనే సందేహాన్ని అనంతర పదం తీరుస్తున్నది.

**(అక్షరమ్)** - నాశం లేనివాడని అర్థం. తన స్వరూపానికి కాని, గుణాలకు కాని, నిత్యసూరులవలె నాశం లేనివాడై ఉన్నా, తనకు మించిన ఇంకొక ఈశ్వరుని కలవాడై ఉంటాడా? అంటే,

**(పరమ్)** - తనకు మించినవారెవ్వరూ లేనివాడు. **"మికు న్దైయిలనే"** (తనకు మించినవాడు లేనివాడు) అని నమ్మాళ్వార్లు అన్నారు. **"తమీశ్వరాణాం పరమం మహేశ్వరం, తం దేవతానాం పరమం చ దైవతమ్"** (ఈశ్వరులందఱిలో గొప్పవాడైన ఈశ్వరుడుగా, దేవతలందఱిలో గొప్ప దేవతగా ఉండేవానిని) అని శ్వేతాశ్వేతరోపనిషత్తులో చెప్పబడినవాడితడే అని తెల్పుతున్నది, వేదం. ఆ విధంగా ఉన్నా, కామాదిదోషాలకు ఇతడు పరతంత్రుడా? అంటే,

**(ప్రభుమ్)** - ఈశ్వరుడై ఉండేవాడు. అందఱిని నియమించేవాడు. కర్మలతో ఇతరులను బంధించేవాడు. తాను కర్మలచే బంధింపబడనివాడు.

**(పరమం ప్రభుమ్ నారాయణమ్)** - గొప్ప ప్రభువై ఉండేవాడు నారాయణుడు. దీనివల్ల, లోకం అంతా నారాయణునకు శేషమని, అతడు శేషి అని తెలుపబడుతున్నది. దీనిని **"మాల్తనిల్ మిక్కదోర్ తేవు ముళదే"** (భక్తవ్యామోహాన్ని కల స్వామికి కంటే వేఱు దైవం ఉన్నదా?) అని నమ్మాళ్వార్లు పలికారు.



**(పరమమ్)**- సర్వైశ్వర్యసంపన్నుడైన లక్ష్మీనాథునకు ఒక విషయంలో దారిద్ర్యమున్నది. సమాధికదరిద్రుడితడు. దీనిని వేదాలు **"న తత్ సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే"** (అతనితో సమానుడు, అతని కంటే గొప్పవాడు ఇంకొకడు లేనివాడు) అని ఘోషించాయి. **"ఒత్తార్ మిక్కారై యిలైయాయ మామాయా"** (మీతో సాటి వచ్చేవారు, మించినవారు ఎవరూ లేనివాడవైన ఆశ్చర్యభూతుడా!) అని నమ్మాళ్వార్లు పలికారు. **"పరమం ప్రభుమ్"** అని పల్కినందున ఇతనికే మనం దాసులమని, ఇతనినే ఆరాధించాలని, **"మఱన్దుమ్ పుఱమ్ తొ*ళా*"** (మఱచిపోయి అయినా అన్యదేవతా సేవనం చేయరాదని) చెప్పబడింది. నమ్మాళ్వార్లు కూడా **"తేవుమ్ ఎప్పొరుళుమ్ పడైక్క పూవిల్ నాన్ముకనై పడైత్త తేవన్ ఎమ్బెరుమానైక్కల్లాల్ పూవుమ్ పూశనైయుమ్ తకుమే"** (దేవతలను, ఇంకా అన్ని వస్తువులను సృష్టించడంకోసం, నాభీకమలంలో చతుర్ముఖుని సృష్టించిన దేవుడైన భగవానునకు తప్ప వేఱొకనికి పూలు, చందనం తగునా?) అని నుడివారు.

మహాభారతంలో రాజసూయయాగ సందర్భంలో అగ్రపూజకు అర్హతను కలవారెవరు? అనే ప్రశ్న ఉదయించినపుడు భీష్ముడు **"స ఏష పృథుదీర్ఘాక్షః సంబంధీ తే జనార్దనః"** (విశాలనేత్రాలను కల ఈ జనార్దనుడు నీకు బంధువు) అని, శ్రుతిలో **"తస్య యథా కప్యాసం పుండరీకమేవ మక్షిణీ"** (సూర్యునిచే వికసింపబడిన పుండరీకాల వంటివి అతని నేత్రాలు) అని చెప్పబడినవాడు కదా మీకు బంధువై జన్మించాడు'' అని పల్కి శ్రీకృష్ణుని పరత్వాన్ని సాధించారు. అన్యదేవతను పొరపాటుగా కూడా కొలువని సహదేవుడు **"తమిమం సర్వసంపన్న మాచార్యం పితరం**

గురుమ్, అర్చ్యమర్చితు మిచ్ఛామః సర్వే సమ్మంతు మర్హథ" (అన్ని నిండుగా ఉండేవాడు, ఆచార్యుడు, తండ్రి, గురువు, పూజింపదగినవాడైన ఈశ్రీకృష్ణుని ఆరాధించగోరుతున్నాము. మీరంతా సమ్మతించండి) అని శ్రీకృష్ణుని పరత్వాన్ని గూర్చి పల్కి, "**యో వా న సహతే రాజ్ఞాం కశ్చిత్ స బలవాహనః, తస్య మూర్ధ్ని సువిన్యస్తం రాజ్ఞః సవ్యం పదం మయా**" (ఈ రాజులలో ఎవడు దీనిని సహించలేడో, ఆ రాజు తలపై నా ఎడమపాదాన్ని నిలుపుతాను) అని తన ఎడమ పాదాన్ని చూపాడు. "**మానినాం బలినాం రాజ్ఞాం మధ్యే సందర్శితే పదే, తతో భవత్ పుష్పవృష్టిః సహదేవస్య మూర్ధని**" (అభిమానాన్ని కల రాజుల మధ్యలో సహదేవునిచే అతని ఎడమపాదం చూపబడగానే, అతని శిరస్సుపై దేవతలు పుష్పవృష్టి కురిపించారు) అనే రీతిలో ఇతరులకెవ్వరికి పరత్వం లేదని, దానిని సహించలేనివారి తలపైనా ఎడమ కాలును పెడతానని సహదేవుడు పల్కగానే, అతని శిరస్సుపై పుష్పవృష్టిని కురిపించారు. జ్ఞాని అయిన భీష్ముని తలపై పుష్పవృష్టి కురవలేదు. ఇతర దేవతాసంబంధం లేశం కూడా లేకుండా చేసికోవడమనే పరమవైరాగ్యాన్ని కల పరమైకాంతి అయిన సహదేవుని తలపై పుష్పవృష్టి కురిసింది.

గొప్ప ప్రభువు ఎవరనే విషయం ఇక్కడ పలు చిహ్నాలతో నిర్ణయింపబడుతున్నది. "**సహస్రశీర్షం దేవమ్**" అని పల్కినందున, "**ముడిచ్చోది, ముకచ్చోది**" (కిరీటకాంతి, ముఖకాంతి) మొదలైనవానిని కలవాడే జగత్కారణతత్త్వమని తెలుపబడింది. "**విశ్వాక్షమ్**" అని అంటూ అతడు సర్వజ్ఞుడని తెలుపబడింది. శ్రీమన్నారాయణుడే జగత్స్రష్ట అని తెలుపబడింది. మిగిలినవారు "**మాలైక్కణ్, పీలిక్కణ్**" అని చెప్పదగినవారు; అంతే. "**విశ్వశంభువమ్**" అని సర్వరక్షకత్వం చెప్పబడింది. ఆపదలో కాపాడేవాడు, పాపాన్ని పోగొట్టేవాడు ఇతడే అని తెలుపబడింది. "**న హి పాలనసామర్థ్యమృతే సర్వేశ్వరం హరిమ్**" (రక్షించే సామర్థ్యం సర్వేశ్వరుడైన



హరికి తప్ప వేతెవ్వరికీ లేదుకదా!) అని కదా చెప్పబడింది. "**విశ్వమ్**" అని సర్వశరీరియై ఉండే స్వభావం చెప్పబడింది. "**దేవమ్**" అని అమలత్వం చెప్పబడింది. "**అక్షరమ్**" అని నాశం లేకుండా ఉండడమనే స్వభావం తెలుపబడింది. ఈ గుణాలను కల నారాయణుడే. గొప్ప ప్రభువు అని విధింపబడుతున్నది. ఇదే, శ్రీరామాయణంలో "**అధికం మేనిరే విష్ణుం దేవ స్సర్షిగణా స్తదా**" (ఋషిగణాలతో కూడిన దేవతలు విష్ణువును సర్వాధికునిగా నిర్ణయించుకొన్నారు) అని ఘోషింపబడింది.

2. విశ్వతః పరమం నిత్యం విశ్వం నారాయణం హరిమ్ ।
విశ్వమేవేదం పురుష స్తద్విశ్వ ముపజీవతి ।
పతిం విశ్వస్యాత్మేశ్వరం శాశ్వతం శివ మచ్యుతమ్ ।
నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్ ॥

అందరికంటే గొప్పవాడు, నిత్యమైనవాడు, అన్ని అయినవాడు, నారాయణుడైన హరియే. ఈ లోకం అంతా పురుషుడే. అందువల్లనే ఈ ప్రపంచం జీవిస్తున్నది. లోకానికి నాయకుడు, ఆత్మలకు స్వామి, జననమరణాలు లేనివాడు, మంగళకరుడు, తనను ఆశ్రయించినవారిని విడువనివాడు, ముఖ్యంగా తెలియదగినవాడు, లోకానికి అంతటికి ఆత్మ, గొప్ప ఉపాయం నారాయణుడే.

**(విశ్వతః పరమ్)** - చేతనాచేతనాలతో నిండిన ఈ జగత్తు కంటే గొప్పవాడు. "**అన్యదేవతా ద్విదితాత్ అథో అవిదితాత్ అధి**" (ఆ పరవస్తువు మనచే తెలియబడిన అచేతనవస్తువు కంటే వేఱయినది. మనచే తెలియబడే ఆత్మవస్తువుకంటే గొప్పది) అని వేదం పల్కింది. "**భేదవ్యపదేశాచ్చ**" (జీవునకు, పరునకు మధ్య భేదం చెప్పబడినందున పరమాత్మ విలక్షణుడు) అని వ్యాసభగవానులు బ్రహ్మసూత్రంలో

నిర్ణయించారు. **"ఇల్లదు ముళ్ళదుమ్ అల్లదు అవనురు"** (స్వరూపంలో మాఱే స్వభావాన్ని కల అచేతనం కంటే, మాఱని స్వభావాన్ని లేని చేతనుని కంటే భగవానుని రూపం విలక్షణమైనది) అని మాఱే స్వభావాన్ని కల అచేతనం కంటే, మాఱని స్వభావాన్ని కల ఆత్మ కంటే విలక్షణమైనది భగవత్ స్వరూపం-అని ఆళ్వార్లు నిర్ణయించారు.

**"అన్యచ్చ రాజన్! స పరః తథాన్యః పంచవింశకః"** (రాజా! పరమాత్మ విక్షణుడు. ఇరవై అయిదవ తత్త్వమైన జీవుని కంటే భిన్నుడు) అని మహాభారతం ఘోషించింది. ఇందువల్ల పరమపురుషునకు, మిగిలినవారికి స్వరూపైక్యం పలికే పక్షాలు నిరసింపబడ్డాయి. సర్వరక్షకుడైన నారాయణునకు, ఇతనిచే కాపాడబడే మిగిలినవానికి ఏ విధంగా ఐక్యం చెప్పడం వీలవుతుంది? కారణభూతుడైన ఇతడు, ఇతనిచే సృష్టింపబడే మిగిలినవి ఒకటి అవుతాయా? **"ఉలకుయిర్ తేవుమ్ మఱ్ఱుమ్"** (లోకాన్ని, ఆత్మలను, దైవాలను, ఇంకా అన్నిటిని) సృష్టించిన **"ఎమ్మామూర్తి"** కదా, ఇతడు.

ఇతడు, ఈ జగత్తు కంటే గొప్పవాడు - అనే విషయాన్ని ఏవిధంగా తెలియడం? అంటే,

**(నిత్యమ్)** - నిత్యుడై ఉండేవాడు. ఈ లోకంలోని అచేతనాలు స్వరూపంలోను, గుణాలలోను మార్పును పొందేవి, చేతనాలు స్వరూపంలో పరిణామాన్ని లేనివే అయినా, కర్మ కారణంగా జ్ఞానాది గుణాలలో హెచ్చు తగ్గులనే తారతమ్యాన్ని కల్గినవి. ఈ రెండు మార్పులను లేనివాడు, ఇతడు.

**(విశ్వతః పరమమ్... విశ్వమ్)** - అన్నిటి కంటే అత్యంతవిలక్షణుడై ఉన్నా, అన్నీ తానే అయినవాడు. **"మూవరాకియ మూర్త్తియై ముదల్ మూవర్క్కుమ్ ముదల్వన్ తన్నై"** (బ్రహ్మరుద్రులతోపాటుగా ఒకడు అనేటట్లున్నవాడు, వారి ముగ్గురికి కాక బ్రహ్మరుద్రేంద్రులకు కారణభూతుడు) అని ఆళ్వార్లు ఈ విషయాన్ని వచించారు. ఇది ఏవిధంగా సాధ్యం? అంటే,



**(నారాయణమ్)** - ఇతడు అన్నిటిలోను వ్యాపించి ఉండి, వానిని, ధరించి ఉండేవాడుకదా ! అందువల్ల ఇతనిని "అన్నీ తానే అయినవాడు" అని చెప్పవచ్చునని వేదం తెల్పుతున్నది. **"సర్వం సమాప్నోషి తతోసి సర్వః"** (నీవు అన్నిటిని వ్యాపించి ఉన్నావు. అందువల్ల అన్నీ అయి ఉన్నావు) అని అన్నాడు. అర్జునుడు. **"అవస్థితే రితి కాశకృత్స్నః"** (పరమాత్మ జీవునిలో వ్యాపించి ఉన్నందున, ఇద్దఱు ఒకటిగా చెప్పబడుతున్నారు- అని కాశకృత్స్నులు అన్నారు) అని వ్యాసులు బ్రహ్మసూత్రాలలో సిద్ధాంతీకరించారు. **"తత్స్థత్వాదనుపశ్యంతి హ్యేక ఏవేతి సాధవః"** (పరమాత్మ జీవునిలో ఉన్నందున ఈ ఇద్దఱిని ఒకడు అనియే సాధువులు దర్శిస్తున్నారు) అని మహాభారతం పల్కింది.

**(నారాయణమ్)**- లోకుల సందేహాన్ని తీర్చడంకోసం ఈ విధంగా మాటిమాటికి నారాయణశబ్దప్రయోగం చేయబడుతున్నది. **"సత్యం సత్యం పున స్సత్యమ్"** అని వ్యాసులు కేశవుడే పరతత్త్వమని మూడు మార్లు ప్రతిజ్ఞ చేశారు కదా!

**"కిం తత్ర బహుభిర్మంత్రైః కిం తత్ర బహుభిః వ్రతైః, నమో నారాయణాయేతి మంత్ర స్సర్వార్థసాధకః"** (పలు మంత్రాలతో, వ్రతాలతో ఏమి ప్రయోజనం? **"నమో నారాయణాయ"** అనే మంత్రమే అన్ని అర్థాలను సాధించి ఇస్తుంది) అని పొగడబడిన నారాయణనామ పారాయణం మహిమను తెలుపడంకోసం ఈ విధంగా నారాయణ నామాన్ని పలుమార్లు పఠిస్తున్నదని కూడా చెప్పవచ్చు.

**(హరిమ్)** - **"నారాయణమ్"** అని సర్వకారణుడు, సర్వరక్షకుడు

ఇతడే- అని నిర్ణయింపబడింది. ఇక్కడ సర్వసంహారకుడు ఇతడే- అని ఘోషింపబడుతున్నది. **"బ్రహ్మాణమింద్రం రుద్రం చ యమం వరుణ మేవ చ, నిగృహ్య హరతే యస్మాత్ తస్మాత్ హరిరిహోచ్యతే"** (బ్రహ్మను, ఇంద్రుని, రుద్రుని, యముని, వరుణుని సంహరించడంవల్ల హరి అని చెప్పబడుతున్నాడు) అని కదా హరిశబ్దం నిర్వచింపబడు తున్నది. **"హరిర్హరతి పాపాని జన్మాంతరకృతాని చ"** (వేఱు జన్మలలో చేసిన పాపాలను కూడా హరి పోగొడుతున్నాడు) అనే విధంగా సకల పాపాలను పోగొట్టేవాడనే అర్థంకూడా గ్రహించవచ్చు. **"కుమరనార్ తాతై తున్బమ్ తుడైత్త కోవిన్దనారే"** (శివుని దుఃఖాన్ని తీర్చిన వాడు గోవిందుడే) అని ఆళ్వార్లు అన్నారు. రుద్రుడు, తనతండ్రి అయిన బ్రహ్మయొక్క తలను గిల్లివేశాడు. అందువల్ల అతనికి కల్గిన మహాపాపాన్ని తీర్చిన వాడితడే కదా!

**(హరిమ్)** - ఇది భగవంతుడు ఇష్టపడిన నామాలలో ఒకటి. వేదప్రతిపాద్యుడితడే - అని చూపడం కోసం వేదారంభంలోను, వేదం చివరలోను **"హరిః ఓమ్"** అని పఠింపబడే నామం ఇదే. **"విశ్వరూపం హరిణమ్"** అని ప్రశ్నోపనిషత్తులో పఠింపబడినవాడితడే - అని ఇక్కడ వేదం తెల్పుతున్నది.

ఇతడు సర్వవ్యాపియై ఉన్నందువల్లనే ''అన్నీ ఇతడే'' అని చెప్పబడుతున్నాయి- అనేది చక్కగా మనస్సులో నిలువడంకోసం మళ్ళీ పల్కుతున్నది.

**(విశ్వమేవేదం పురుషః)** - ఈ జగత్తు అంతా పరమపురుషుడే. **"పూర్ణత్వాత్ పురుషః"** అనే రీతిలో అంతటా నిండి ఉన్నవాడైనందున పురుషుడని చెప్పబడుతున్నాడు. అందువల్లనే ''అన్నీ ఇతడే'' అనబడుతున్నాడు. ఆళ్వార్లు కూడా **"తానే యాకి నిఱైన్దు ఎల్లా ఉలకుమ్ ఉయిరుమ్ తానేయాయ్ తానే యానెన్బానాకి"** (అంతటా తానై నిండి,



జగత్తు, ఆత్మలు తన ప్రకారాలుగా కలవాడై, తానే నేను అనేనట్లుగా అయినవాడై) అని తిరువాయ్‌మొళిలో పలికారు. **"తాను"** అనే పదంలో అన్ని లోకాలు అంతర్భవించి ఉండేటట్లు ఉండేవాడు. వేదం **"సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలాన్"** (బ్రహ్మంనుండే పుట్టినందున, అంతకు మించి, రక్షింపబడుతున్నందున, ఆ బ్రహ్మంలోనే లయిస్తున్నందున ఇవి అన్నీ పరబ్రహ్మమే) అని పల్కింది.

**(ఇదం విశ్వం పురుష ఏవ)** - ఈ లోకం అంతా పురుషుడే. కారణావస్థలోను, కార్యావస్థలోను బ్రహ్మం చిదచిద్విశిష్టమైన ఉన్నా, విశేష్యమైన బ్రహ్మమే ప్రధానమైనందున బ్రహ్మమే ఉపాదాన కారణమని, వికారాదులు విశేషణగతాలని చెప్పబడుతున్నది. స్వాభావికమైన శరీర శరీరి సంబంధంచేత వస్తువు ఒకటే - అని చెప్పదగినట్లున్నది. జీవుడు అనాదికాలంగా అచిత్తులో వ్యాపించి, దానితో అలవాటు పడి వర్తించే వాడు. చేతనముఖంగా అచేతనంలోను అనుప్రవేశిస్తున్నాడు, నారాయణుడు. భగవానునకు శరీరం ఆత్మవస్తువు. అచేతనంకూడా అతనికి (జీవునకు) శరీరమైనందున నారాయణునకు శరీరం అవుతున్నది. **"అనేన జీవేనాత్మనానుప్రవిశ్య"** (నన్ను అంతర్యామిగా కల్గిన జీవునిద్వారా వ్యాపించి) అని కదా చెప్పబడింది. ఈవిధంగా అంతటా వ్యాపించినందున ఇతనిని **"విశ్వమ్"** అని అనడంలో అడ్డు లేదు.

**(తద్విశ్వ ముపజీవతి)** - ఇతడు అంతరాత్మగా ఉన్నందువల్లనే లోకం అంతా ఇతనిని పొంది జీవిస్తున్నది. దీనివల్లకూడా విశ్వానికి, వాసుదేవునకు స్వరూపైక్యం లేదు- అని సిద్ధిస్తున్నది.

**(తద్విశ్వముపజీవతి)** - **"తేన వినా తృణమపి న చలతి"**, **"అవనన్డి ఓరణువుమ్ అశైయాదు"** (అతడు లేక పోతే గడ్డిపోచ కూడా ఒక అణువు కూడా కదలదు) అని చెప్పబడుతున్నది కదా. ఇక్కడ అతని రక్షకత్వం

చెప్పబడుతున్నది. **"నానున్నై యన్ఱి యిలేన్ కణ్డాయ్, నారణనే! నీ ఎన్నై యన్ఱి యిలై"** (నారాయణా! నీవు లేకపోతే నేను లేనుసుమా! నేను లేకపోతే నీవు కూడా లేవు) అని తిరుమழிశై ఆழ்వార్లు కూడా పలికారు. **"తానే ఉలకెల్లామ్ తానే పడైత్తిడన్దు తానే ఉణ్డుమిழ్న్దు తానే యాళ్వానే"** (తానే సమస్తజగత్తు, తానే దానిని సృష్టించి, కొలిచి, తానే ఆరగించి, వెలువరించి, తానే రక్షిస్తున్నాడు) అని అన్నారు నమ్మాழ்వార్లు కూడా. ఈలోకాన్ని సృష్టించి, ప్రళయజలంనుండి ఉద్ధరించి, ప్రళయమనే ఆపదలో తనలోనికి గ్రసించి, తర్వాత వెలువరించి - ఈ విధంగా సర్వవిధాలుగా రక్షణాలను చేసేవాడితడే - అని ఇక్కడ చూపబడింది. తర్వాత, ఈ విధంగా సర్వవిధ రక్షణాలను చేసే ఇతనిదే ఈ లోకం అంతా- అని ఉపనిషత్తు ఉద్ఘోషిస్తున్నది.

**(పతిం విశ్వస్య)** - లోకాలన్నిటికి స్వామి- అని అర్థం. ఇందువల్ల శేషశేషిసంబంధం చెప్పబడింది. **"ఉణ్డుమ్ ఉమిழ்న్దుమ్ కడన్దుమ్ ఇడన్దుమ్ కిడన్దుమ్ నిన్ఱుమ్ కొణ్డ కోలత్తొడు వీற்றிరున్దుమ్ మణమ్ కూడియుమ్ కణ్డ వాற்றాల్ తనదే ఉలకెన నిన్ఱాన్"** (జగత్తును ఆరగించి, బయటకు వెలువరించి, కొలిచి, ఉద్ధరించి, పరుండి, నిలచి, పట్టాభిషేక అలంకారంతో వేంచేసియుండి, భూదేవితో కలసి - ఈవిధంగా చూస్తే ఈ రీతులలో అన్నింటిలో భూమి అంతా తనదే అనేటట్లు ఉన్నాడు) అని ఆழ்వార్లు ఈ అర్థాన్ని అనుసంధించారు. "ఒకడు ఒక సస్యక్షేత్రాన్ని దున్నడం, ఎరువు వేయడం, సాగు చేయడం చేస్తే, ఆ భూమి అతనిది అని తెలుస్తుంది కదా'' అని మన పూర్వాచార్యులు సూక్తిని వివరిస్తూ ఒక చక్కని లౌకికదృష్టాంతాన్ని పల్కుతారు.

**(ఆత్మేశ్వరమ్)** - వీరికి స్వామియై ఉండడంతోపాటు, వీరిని నియమించేవాడు - అని అర్థం. ఇక్కడ ఆత్మశబ్దం అచేతనానికి కూడా ఉపలక్షణం.



**(ఆత్మేశ్వరమ్)** - తనకు తానే ఈశ్వరుడు - అనే అర్థాన్ని కూడా గ్రహించవచ్చు. చేతనాచేతనాలకు తాను ఈశ్వరుడై ఉండేటట్లే, తనకు ఏ ఈశ్వరుని లేనివాడు - అని అర్థం.

**(శాశ్వతమ్)** - ఆదిని, అంతాన్ని లేనివాడు-అని అర్థం. ఇందువల్ల అంతాన్ని కలవారైన బ్రహ్మ, రుద్రుడు మొదలైనవారికంటే నారాయణుని గొప్పతనం చెప్పబడింది.

**(శివమ్)** - మంగళకరుడై ఉండేవాడు - అని అర్థం. అందువల్ల అథర్వశిఖలోను, శ్వేతాశ్వతరోపనిషత్తులోను శివశబ్దంతో చెప్పబడే వాడితడే - అని తెలుపబడింది.

**(శాశ్వతం శివమ్)** - ఎల్లప్పుడు పరిశుద్ధుడై ఉండేవాడు -అని అర్థం. దీనివల్ల కొన్నికొన్ని సమయాలలోమాత్రం పరిశుద్ధుడై ఉండే శివుడు కాడు ఇతడు - అని తెలుపబడుతున్నది. ఆ శివుడు జన్మించినపుడే **"అనపహతపాప్మావాహమ్"** (నేను పాపం తీరనివాడనై ఉన్నాను) అని తనతండ్రి అయిన బ్రహ్మతో అన్నాడు. భగవన్నామాలైన శివాది నామాలను పొందిన తరువాతనే అతడు పరిశుద్ధుడయ్యాడని ఘోషిస్తున్నది వేదం. తరువాత, తన తండ్రియైన బ్రహ్మశిరస్సును గిల్లి అపరిశుద్ధ డయ్యాడు. వేదాన్ని అధ్యయనం చేసిన మొదటి వేదవిదుడైన బ్రహ్మ శిరస్సును గిల్లినందున శివుడు బ్రహ్మహత్యాదోషాన్ని పొంది, కపాలం చేతికి అంటుకోగా పరితపించాడు. అపుడు కూడా అతనిని పరిశుద్ధునిగా చేసినవాడు అచ్యుతుడే కదా! **"యచ్ఛౌచనిఃసృతసరిత్ప్రవరోదకోభూత్ తీర్థేన మూర్ధ్ని విధృతేన శివః శివోభూత్"** (ఎవని శ్రీచరణాలను కడిగిన గంగా జలాన్ని తలపై ధరించినందున శివుడు పరిశుద్ధుడయ్యాడో) అని భాగవతంలో తెలుపబడింది. శ్మశానభూమిలోని బూడిదను పూసికొని, కపాలమాలను ధరించి, శ్మశానభూమివాసిగా తిరిగేవానిని పరిశుద్ధుడైన

వాడని ఏ విధంగా పల్కడం సాధ్యం? యజ్ఞాదులలో రుద్రుని పేరును చెప్పగానే ఈ నాటికీ జలాన్ని స్పృశించి పరిశుద్ధులమవు తున్నాము. యజ్ఞం చేసేవానికి రుద్రుని అంశం ఉన్నది. అందువల్ల బ్రహ్మతలను గిల్లిన అనామిక (ఉంగరం వేలు) అపరిశుద్ధమైనది. ఆ అపవిత్రతను పోగొట్టుకొవడం కోసం మనం ఆ వేలుకు పవిత్రాన్ని ధరిస్తున్నాము. శివశబ్దం విష్ణుసహస్రనామంలో పఠింపబడినందున అది విష్ణువును తెల్పుతున్నదని తెలుస్తున్నది. శ్రీరామాయణంలో కూడా **"పావన స్సర్వలోకానాం త్వమేవ రఘునందన"** (శ్రీరామా ! నీవే లోకాన్ని అంతటిని పరిశుద్ధం చేసేవాడవు) అని ఘోషింపబడింది కదా!

**(అచ్యుతమ్)** - తనను ఆశ్రయించినవారిని జారవిడువనివాడు. ఆపత్కాలంలో తొలగిపోయేవాడు అచ్యుతుడవుతాడా? శివశబ్దం లోకంలో ప్రసిద్ధమైన శివుని నిర్దేశించలేదు- అని తెలుపడం కోసం ముందు వెనుక ఆ శివునకు ఎంతమాత్రం పొసగని నామాలను వేదం పఠించింది. తనను ఆశ్రయించిన బాణుని ఆపత్కాలంలో అతని చేయివిడచి రుద్రుడు తొలగిపోయాడు కదా ! **"మోడియోడిలచ్చైయాయ శాపమెయ్ది ముక్కణాన్ కూడుశేనై మక్కళోడు కొణ్డుమణ్డి వెఞ్జమత్తు, ఓడ వాణనాయిరమ్ కరమ్ కழித్త ఆదిమాల్"** (త్రినేత్రుడు తన సేనతో, పుత్రులతో పాటు భయపడి పారిపోగా, బాణుని వేయి బాహువులను ఖండించిన జగత్కారణభూతుడైన సర్వేశ్వరుడు) అని తిరుమழிశైప్పిరాన్ అనుగ్రహించిన సూక్తి ఇక్కడ అనుసంధేయం.

**(నారాయణం మహాజ్ఞేయమ్)** - తెలియదగినవారిలో గొప్పవాడు నారాయణుడే. తనను ఆశ్రయించినవారిని జారిపోనీయనివాడు ఇతడే కనుక, ఇతడే తెలియదగినవాడు - అని తెలుపబడుతున్నది. ఇతనిపట్ల భక్తి లేనివారు. **"విష్ణుభక్తిపరో దేవః విపరీత స్తథాసురః"** (విష్ణుభక్తిని కలవాడే దేవుడు, అది లేనివాడు అసురుడు) అని, **"యః పుత్రః పితరం ద్వేష్టి తం విద్యాదన్యరేతసమ్, యస్తు నారాయణం ద్వేష్టి తం విద్యాదంత్య రేతసమ్"** (తండ్రిని ద్వేషించే పుత్రుని ఇంకొకనికి పుట్టినవానినిగా తెలియాలి. నారాయణుని ద్వేషించేవానిని అంతిమకులంలో పుట్టిన వానినిగా తెలియాలి) అని నిందింపబడ్డారుకదా!



**(మహాజ్ఞేయమ్)** - అథర్వశిఖలోని **"కారణం తు ధ్యేయః"** (జగత్కారణమైనవాడే ధ్యానించదగినవాడు) అని చెప్పబడినవాడితడే- అని ఈ పదంద్వారా సూచింపబడుతున్నది. చేతనాచేతనాలకంటే విలక్షణుడని తెలియదగినవాడు - అని అర్థం. శ్రుతి-స్మృతి-ఇతిహాస-పురాణాదులన్నిటిలో గొప్పవాడుగా తెలియదగినవాడు, సకలవైదిక క్రియలలోను తెలియదగినవాడు - అని కూడా అర్థం. **"దానయజ్ఞ వివాహేషు సమాజేషు మహత్సు చ, న ద్రక్ష్యామ పునర్జాతు ధార్మికం రామ మంతరా"** (దానాలలో, యజ్ఞాలలో, వివాహాలలో, గొప్ప సభలలో ధార్మికుడైన శ్రీరాముని తప్ప మఱెవ్వరినీ మేము చూడలేదు) అని కదా చెప్పబడింది.

**(మహాజ్ఞేయమ్)**- ఇతనిని తెలిస్తే అన్నిటిని తెలిసినవాడవుతాడు కదా! ఛాందోగ్యోపనిషత్తులో శ్వేతకేతువును చూచి అతని తండ్రి **"యథా సౌమ్య ! ఏకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాత్... ఏవం సౌమ్య న ఆదేశో భవతి"** (కుమారా! మట్టిముద్దను గూర్చి తెలిస్తే ఏవిధంగా మట్టితో నిర్మింపబడినవి అన్నీ తెలియబడినవి అవుతాయో, ఆ రీతిలోనే ఆ సర్వేశ్వరుడు కూడా తెలియబడినవాడవుతున్నాడు) అని పల్కిన వాక్యం ఇక్కడ అనుసంధేయం. సకలచేతనాచేతనవిశిష్టుడైన పురుషోత్తముని తెలిస్తే అన్నింటినీ తెలిసినవాడవుతున్నాడు కదా! అందువల్లనే ఇక్కడ **"మహాజ్ఞేయమ్"** అని చెప్పబడుతున్నాడు. ''తెలియడానికి సాధ్యం

కానివాడు'' అని వేదాలలో చెప్పబడగా, మఱి ఇక్కడ ఏవిధంగా తెలియదగినవాడని చెప్పవచ్చు? అంటే, పరిచ్ఛేదించి తెలియడానికి సాధ్యం కానివాడు - అని తెలిస్తే, ఇతనిని సరిగా తెలిసినట్లవుతుంది. **"మేలై వానవరుమ్ అఱియార్"** (నిత్యసూరులు కూడా నిన్ను తెలియలేరు) అని, **"బ్రహ్మాపి న వేద నారాయణం ప్రభుమ్"** (ప్రభువైన నారాయణుని బ్రహ్మకూడా తెలియలేడు) అని చెప్పబడింది కదా!

దీనివల్ల **"జ్ఞాత, జ్ఞానం, జ్ఞేయం"** అనే మూడు విధాలైన, సత్యమైన వస్తువులున్నాయని తెలుస్తున్నది. **"మహాజ్ఞేయమ్"** అనేదానినుండి ఒక్కొక్క రీతిలోను పలు వస్తువులున్నాయని ఏర్పడుతున్నది. జ్ఞానమాత్రాన్ని పలికే సందర్భాలను **"తద్గుణసారత్వాత్తు తద్వ్యపదేశః"** (జ్ఞానగుణం ముఖ్యంగా ఉన్నందున జ్ఞానపదంతో ఆత్మ నిర్దేశింప బడుతున్నది) అనే బ్రహ్మసూత్రంలో పల్కిన రీతిలో ఇక్కడ అర్థాన్ని గ్రహించాలి. **"య స్సర్వజ్ఞ స్సర్వవిత్"** అని ఇతనిని జ్ఞాతగా, పల్కిందికదా వేదం. అందువల్ల ఇతడు అన్నిటిని తెలిసినవాడైనందున **"జ్ఞాత"** అని, జ్ఞానస్వరూపుడైనందున **"జ్ఞాన"**మని, జ్ఞానులచే తెలియబడుతున్నందున **"జ్ఞేయ"**మని చెప్పబడుతున్నాడు.

**(విశ్వాత్మానమ్) - "విశ్వమ్"** - ఈ లోకం అంతా పురుషుడే'' అని ముందు చెప్పబడినదానికి హేతువు ఇక్కడ స్ఫుటపడుతున్నది. విశ్వానికి లోకానికి అంతటికి ఆత్మయై ఉన్నందున విశ్వమనే చెప్పబడేవాడు. **"ఓరుయిరేయో ఉలగ్గట్కెల్లామ్"** (లోకాలకు అన్నిటికి అద్వితీయ ప్రాణం) అని అన్నారు ఆళ్వార్లు. **"పతిం విశ్వస్యాత్మేశ్వరమ్"** అని, **"విశ్వతః పరమ్"** అని పల్కుతూ భేదశ్రుతులను తెల్పుతున్నది, వేదం. ఆ విధంగానే, **"విశ్వమ్"** అని, **"విశ్వమేవేదమ్"** అని అభేదశ్రుతులను తెల్పుతున్నది. **"విశ్వాత్మానమ్"** అని ఈ రెండు విధాలైన శ్రుతులను సమన్వయపరచే ఘటక శ్రుతులను సూచిస్తున్నది. వేదవాక్యాలను మూడు



విధాలుగా విభాగించవచ్చు. **"నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానామ్"** (నిత్యులైన అనేకజీవులలో ఒకడైన, నిత్యుడై ఉండే పరమాత్మ) అని, **"పృథగాత్మానం ప్రేరితారం చ మత్వా"** (జీవుని, జీవుని వేఱుగా తెలిసికొని) అని, **"ద్వా సుపర్ణా సయుజా"** అని గల పలువేల సంఖ్యలోని వేదవాక్యాలు, పరమాత్మ, చేతనాచేతనాలు చాలా భిన్నమైనవి అని మొఱపెడు తున్నాయి. వీటిని భేదశ్రుతులని అంటారు. **"తత్ త్వమసి"** (నీవు అదియై ఉన్నావు) **"సర్వం ఖల్విదం బ్రహ్మ"** (ఇది అంతా బ్రహ్మమే కదా)మొదలైన కొన్ని వేదవాక్యాలు పరమాత్మ, మిగిలినవి అన్ని ఒకటి - అని పల్కు తున్నాయి. ఇవి అభేదశ్రుతులనబడతాయి. **"యః పృథివీ మంతరో సంచరన్ యస్య పృథివీ శరీరం యం పృథివీ న వేద"** (ఎవడు పృథివిలో సంచరిస్తూ ఉన్నాడో, ఎవనికి పృథివి శరీరమో, ఎవనిని పృథివి తెలియలేదో) అని, **"య ఆత్మని తిష్ఠన్ ఆత్మనో అంతరః యమాత్మా న వేద యస్యాత్మా శరీరమ్"** (ఎవడు ఆత్మలో నిలచిఉన్నాడో, ఆత్మను నియమించేవాడై ఉన్నాడో, ఎవనిని ఆత్మ తెలియలేదో, ఎవనికి ఆత్మశరీరమో) అని, **"ఏష సర్వభూతాంతరాత్మా అపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః"** (ఇతడే సర్వప్రాణులకు అంతరాత్మయై ఉన్నవాడు, దోషవిదూరుడు, వైకుంఠంలో ప్రకాశించేవాడైన నారాయణుడు) అని మొదలైన శ్రుతులు నారాయణుడు సర్వవ్యాపియై ఉన్నదున సర్వశబ్దవాచ్యుడవుతున్నాడు - అని చూపడంద్వారా భేదశ్రుతులకు, అభేదశ్రుతులకు, పైపైన గమనించి చూచినపుడు ఏర్పడే విరోధాన్ని తీరుస్తున్నాయి. వీటినే ఘటకశ్రుతులని అంటున్నాము. ఈ మూడు విధాలైన శ్రుతులను ఇక్కడ పఠించడంద్వారా విశిష్టాద్వైతమే వేదాంతంలోని అంతరార్థమని వేదం తెల్పుతున్నది. అద్వైతులు అభేదశ్రుతులను మాత్రం గ్రహించి, మిగిలిన శ్రుతులను దుర్బలమైనవి అని తోసిరాజంటున్నారు. మఱి కొందఱు భేదశ్రుతులను మాత్రం

ముఖ్యంగా గ్రహిస్తున్నారు. వేదవాక్యాలన్నిటికి సమన్వయం కుదిరేటట్లు అర్థాన్ని పలికే విశిష్టాద్వైతమే వేదానికి అభిమతమైనది - అనేదానిని నిష్పక్షపాతంగా ఉండేవారు స్పష్టంగా దర్శించవచ్చు.

**(పరాయణమ్)** - గొప్పదైన ఉపాయంగా, గొప్పదైన ప్రాప్యంగా ఉండేవాడు. ఇక్కడ నారాయణశబ్దంలోని అర్థాన్ని వివరిస్తున్నది వేదం. యుధిష్ఠిరుడు భీష్ముని **"కిం వాప్యేకం పరాయణమ్?"** అని ప్రశ్నించినపుడు, భీష్ముడు **"పరమం యః పరాయణమ్"** అని జగన్నాథుడైన శ్రీకృష్ణుని చూపించాడు.

**(పరాయణమ్)** - గొప్ప ఉపాయమై ఉండేవాడు - అని అర్థం. ఈ లోకంలో ఉండేవారు మోక్షాన్ని పొందడానికి పలు మార్గాలను వాసుదేవుడు చూపించాడు. అవి మోక్షోపాయాలనబడుతున్నాయి. **"కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః"** (కర్మయోగంవల్లనే జనకుడు మొదలైనవారు సిద్ధిని పొందారు) అని చెప్పబడిన కర్మయోగం, **"జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా"** (జ్ఞానమనే అగ్నికూడా ఆవిధంగానే కర్మలనన్నిటిని దగ్ధం చేస్తుంది) అని చెప్పబడిన జ్ఞానయోగం, **"భక్త్యా త్వనన్యయా శక్యః"** (అనన్యమైన భక్తితో నేను పొందదగినవాడను) అని కీర్తింపబడిన భక్తియోగం, అవతారరహస్య జ్ఞానం, పురుషోత్తమవిద్య, పుణ్యక్షేత్రవాసం, తిరునామసంకీర్తనం మొదలైనవి మోక్షోపాయాలుగా శాస్త్రాలలో పఠింపబడ్డాయి. వాటి అన్నిటికంటే ఇతడు గొప్ప ఉపాయమనే విషయం ఇక్కడ ఉద్ఘోషింపబడుతున్నది. ఆ ఉపాయాలకంటే ఇతనికి పలు విధాలైన అతిశయాలున్నాయి. అవి అన్నీ శ్రమసాధ్యాలు. ఇతడు సిద్ధోపాయం. అవి వెంటనే నశించేవి అయినందున, అచేతనాలైనందున ఫలాన్ని స్వయంగా ఇవ్వలేవు. ఇతడు నిత్యుడు కనుక, పరమచేతనుడు కనుక ఫలప్రదుడై ఉన్నాడు. కర్మజ్ఞానాదులను అనుష్ఠించడానికి కొందఱికి



మాత్రమే యోగ్యత ఉన్నది. అవి పలు విధాలైన అంగాలను అపేక్షిస్తాయి. ఇతడు సహాయాంతరనిరపేక్షుడు. కర్మజ్ఞానాదులు అంతిమస్మృతిని అపేక్షిస్తాయి. ఇతనిని ఆశ్రయించినవారికి అంతిమస్మృతి ఆవశ్యకం కాదు. అవి ఈ జన్మలోనే మోక్షాన్ని ఇస్తాయి - అనే నిశ్చయం లేదు. ఇతనిని ఆశ్రయించినవారు ఈ జన్మలోనే ముక్తిని పొందుతారు. స్వప్రయత్నంతో సాధింపబడే అవి అత్యంతం పరతంత్రుడైన ఇతని (నీవని) స్వరూపానికి విరుద్ధాలు. భగవానుని ఆశ్రయించడం జీవునకు స్వరూపానురూపం. అందువల్లనే కఠోపనిషత్‌లో **"పురుషా న్న పరం కించిత్ సా కాష్ఠా సా పరా గతిః"** (పురుషుని కంటే గొప్పది లేదు. అతడే గొప్ప ఉపాయం, గొప్ప ఉపేయం కూడా) అని ఉద్ఘోషింపబడింది. ఇక్కడ, నారాయణవల్లిలో కూడా **"న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకేన అమృతత్వ మానశుః"** (కర్మలవల్ల, సంతానం వల్ల, ధనం వల్ల అతనిని పొందడం వీలు కాదు. ఆత్మను అతనివద్ద సమర్పించడం వల్లనే మోక్షాన్ని పొందారు) అని చెప్పబడింది. **"సర్వలోకశరణ్యాయ రాఘవాయ మహాత్మనే"** (సమస్తలోకానికి శరణ్యుడు, మహాత్ముడైన శ్రీరామునకు) అని శ్రీరామాయణంలో కూడా చెప్పబడింది.

అతడు తప్ప మిగిలిన ఉపాయాలు **"ఉపాయం"** అని చెప్పడానికి కూడా అర్హత లేనివి. ఇవి ఫలాన్ని ఇవ్వడానికి అతనినే ఆశిస్తాయి, ఎదురు చూస్తాయి. సర్వేశ్వరుడైన ఇతడు వేఱుదేనినీ ఎదురు చూడకపోవడమే కాకుండా, మనం కోరినదానికంటే ఎక్కువగా ఒకటి పదింతలుగా, నూఱు రెట్లుగా ఫలాలను ఇస్తాడు. అంతటి గొప్ప పరిమితిలో ఇచ్చినా "ఏమీ చేయలేకపోయానే! అయ్యో !" అని మనసులో ఎంతో కొఱతపడతాడు. **"గోవిందేతి యదాక్రందత్ కృష్ణా మాం దూరవాసినమ్, ఋణం ప్రవృద్ధ మివ మే హృదయాన్నాపసర్పతి"** (గోవిందా! అని చాలా దూరం నుండి

నన్ను ద్రౌపది పిలిచిన పిలుపు, చక్రవడ్డీతో పెరిగిన ఋణంవలె, నా హృదయం నుండి వీడిపోవడం లేదు) అని కలత పొందినవాడుకదా, అతడు. "రక్షకులుగా ప్రసిద్ధులైన భర్తలు అయిదుగు రు ఉండగా, నన్నే రక్షకునిగా తలచి పిలిచినా, నేను ఆమెకు ఆ సమయంలో దగ్గరగా ఉండలేక పోయానే! అయ్యో !'' అని చాలా బాధపడ్డాడు, అతడు. "ఆమె తనకు తగిన రీతిలో చేసింది. కాని, నేను అవతారం ఎత్తినా, అవతార ప్రయోజనాన్ని కొంచెంకూడా పొందలేకపోయాను'' అని క్లేశపడ్డాడు. ధర్మపుత్రునకు పట్టాభిషేకం జరిపించి, ద్రౌపది కేశాలకు ముడివేయించి, విరోధి వర్గాలను నశింపజేసినా, పరమపదానికి పోయే సమయంలో కూడా **"నాతిస్వస్థమనా యయౌ"** అని మనస్సులో సమాధాన పడలేనివాడై పల్కినట్లుగా కదా చెప్పబడింది.

ఉపాయాంతరాలు చాలా కాలం గడచిన తరువాత ఫలాన్ని ఇస్తాయి. ఇతడు భక్తుల సంభ్రమంతో **(అరై కులైయ త్తలై కులైయ)** పరుగెత్తివచ్చి, ఆపదను తీరుస్తాడు. **"పరమాపద మాపన్నో మనసా చింతయద్ధరిమ్, స తు నాగవరః శ్రీమాన్ నారాయణపరాయణః"** (గొప్ప ఆపదను పొందినవాడు, శ్రీవైష్ణవత్వమనే లక్ష్మిని కలవాడు, నారాయణుడే గొప్ప ఉపాయంగా తలచి ఆశ్రయించినవాడైన గజేంద్రాఴ్వాన్ తన మనస్సులో హరిని స్మరించాడు) అనే విధంగా శ్రీగజేంద్రుడు స్వయత్నాన్ని వీడి, **"ఆదిమూలమా!"** అని ఆర్తనాదం చేయగానే, పాదుకలను అలంకరించు కోకుండానే, భూమిపై పది పన్నెండు అడుగులు వేసి, తరువాత ఏ వాహనాలంకారాలు లేకుండా గరుడునిపై అధిరోహించి, వాయువేగమనో వేగాలతో సాక్షాత్కరించాడు కదా! **"మఴుజ్గాద వై నుతియ శక్కరనల్ వలత్తైయాయ్ తొఴుజ్కాదల్ కళిఱళిప్పాన్ పుళ్ళూర్న్దు తోన్టినైయే"** (మొక్కపోని అంచును కల శ్రీసుదర్శనచక్రాన్ని కుడిచేతిలో కలవాడా!



నీకు నమస్కరించాలనే ప్రేమను కల గజేంద్రుని రక్షించాలని గరుడుని అధిరోహించి ప్రత్యక్షమయ్యావు కదా) అని నమ్మాఴ్వార్లు, **"అతంత్రితచ మూపతి ప్రహితహస్త మస్వీకృతప్రణీత మణిపాదుకం కిమితి చాకులాంతఃపురమ్, అవాహనపరిష్క్రియం పతగరాజ మారోహతః, కరిప్రవరబృంహితే భగవత స్త్వరాయై నమః"** (గజేంద్రాఴ్వాన్ కంఠధ్వని చెవి సోకగానే, విష్వక్సేనులు ఇచ్చే కైదండను లెక్కించకుండా, తీసికొని రాబడిన మణిపాదుకలను అలంకరించు కోకుండా, "దీనికేమి కారణం?'' అని దివ్యదేవేరులు తికమకపడగా, వాహనపరిష్కారాలను వేనినీ చేయకుండా గరుడుని అధిరోహించిన భగవంతుని త్వరకు నమస్కారం) అని పరాశరభట్టరు ఈ విషయంలో అభినివేశాన్ని పొందారు.

భగవంతుడే మోక్షోపాయం అయితే, అతడు ఎల్లప్పుడు సిద్ధోపాయ రూపుడైనందున, అందఱికీ మోక్షం కలగాలికదా? మఱి, అతడు కొందఱికి మాత్రమే మోక్షాన్ని అనుగ్రహిస్తే, అతడు పక్షపాతాన్ని కలవాడు, దయ లేనివాడు - అనే దోషాలు సంభవిస్తాయికదా! అనే సందేహాలు కొందఱికి కల్గుతాయి. **"రక్ష్యాపేక్షాం ప్రతీక్షతే"** (రక్షింపబడే వారి అపేక్షను భగవానుడు ఎదురు చూస్తాడు) అనేరీతిలో భగవంతునిపట్ల అద్వేషం, ఆభిముఖ్యం కలవారు, అతనినే ఉపాయంగా ఆశ్రయించిన వారైన చేతనులనే అతడు రక్షిస్తాడు కనుక, ముందు పల్కిన దోషాలు ఏమీ సంభవించవు. ఆ విధంగా అయితే, ఆ అద్వేషం, ఆభిముఖ్యం మొదలైనవానినికూడా ఉపాయంగా గ్రహించవద్దా? అని అంటే, అవి ఉపాయాలు కాబోవు. భగవంతుడు మనలను సృష్టించడం, కరణకళేబరాలను ఇవ్వడం, మనలను సంస్కరించడంకోసం పలు శాస్త్రాలను ప్రసాదించడం మొదలైన కార్యాలను చేసినందువల్లనే మనకు ఆ అద్వేసం మొదలైనవి ఏర్పడతాయి. అందువల్ల, మనం వానిని ఉపాయంగా

భావించరాదు. అధికారి విశేషణాలుగానే వానిని భావించాలి. అన్నానికి "క్షుత్తు-అంటే-ఆకలి-సాధనం అయినపుడు కదా ఆ స్వీకారానికి సాధనత్వం ఉంటుంది. **"క్షుత్తు అన్నత్తుక్కు సాధనమామన్టితే ఇన్ద స్వీకారత్తుక్కు సాధనత్వ ముణ్డావదు"** (ఆకలి అన్నానికి సాధనమైనపుడు కదా ఈ స్వీకారానికి సాధనత్వం ఉంటుంది) అని పెరియవాచ్చాన్‌పిళ్ళై పరన్దరహస్యమనే గ్రంథంలో పలికారు. ఆకలి గొన్నవానికి ఒక ప్రభువు అన్నం పెట్టాలని వస్తే, ఆకలియే అన్నానికి సాధనమని చెప్పబడుతుందా? అన్నం పెట్టేవాడు ప్రభువు కదా! ఆ విధంగానే, శరణు పొందినవానికి మోక్షాన్ని అనుగ్రహిస్తాను - అనే భగవంతుని సంకల్పాన్ని పురస్కరించు కొని శరణాగతియే ఉపాయమని చెప్పడం సాధ్యంకాదు. **"వనత్తిడరై ఏరియామ్ వణ్ణమ్ ఇయఱ్ఱు మిదువల్లాల్ మారి యార్ పెయ్‌కిఱ్పార్ మఱ్ఱు?"** (అరణ్యప్రాంతాన్ని చెఱువుగా మార్చడం తప్ప వర్షాన్ని ఎవరు కురిపించగలరు?) అని ఆళ్వార్లుకూడా అన్నారు. మనం చెఱువును త్రవ్వించినంతమాత్రంతో దానిలో నీరు నిండేటట్లుగా వర్షం కురవదు. అందువల్ల, వర్షానికి చెఱువు తవ్వడం ఉపాయం కాబోదు. అయినా, వర్షం కురిసేటపుడు, దానిని ఒకచోట చేర్చి తేటపడేటట్లుగా చేయడం కోసం చెఱువు తవ్వుతున్నాము. ఈ రీతిగానే భగవత్ప్రాప్తికి సాధనం కాకపోయినా, భగవంతుడు మనలను అనుగ్రహించేటపుడు అతని కృపకు మనం పాత్రం అయేటట్లుగా మనం మనలను అద్వేషాదులతో సంస్కరించు కొంటున్నాము; అంతే.

**(పరాయణమ్)**- కర్మాదులవలె అచేతనంగా కాకుండా, చేతనులై ఉన్నా, ఆశక్తులు కనుక బ్రహ్మ, శివుడు మొదలైనవారు కూడా ఉపాయం కాబోరు. శివుడు మార్కండేయుని ఉద్ధరించినది కూడా నారాయణుని కృపవల్లనే కదా! నమ్మాళ్వార్లు కూడా **"పుక్కడిమైయినాల్ తన్నైక్కొణ్డ మార్‌క్కణ్డేయనవనై నక్కపిరానుమ్ అన్ఱుయ్యక్కొణ్డదు నారాయణ**



**నరుళే"** (తనకు దాసుడై ఆశ్రయించిన మార్కండేయుని అపుడు శివుడు రక్షించడానికి కూడా కారణం నారాయణుని కృపయే) అని అన్నారు.

**(పరాయణమ్)** - ప్రాప్యంలో (పొందదగిన వస్తువులలో) గొప్పవాడై ఉండేవాడు. ఐశ్వర్యం అల్పంగాను, స్థిరంగా నిలచి ఉండనిదిగాను ఉండేది కనుక అది హేయమైనది. ఆత్మలాభం, భగవత్ప్రాప్తి కంటే అల్పంగా, స్థిరమై ఉన్నందున అధమమైనది. ఈ విషయాన్ని నమ్మాళ్వార్లు **"కుఱుకా నీళా ఇఱుదు కూడా ఎన్నైయూళి శిఱుకా పెఱుకా అళవిల్ ఇన్బమ్ శేర్‌న్దాలుమ్, మఱుకాలిన్ఱి మాయోన్! ఉనక్కే ఆళాకుమ్ శిఱుకాలత్తై యుఱుమో! అన్దో! తెరియిలే"** (పొట్టిగా, పొడుగుగా కానిది, అంతం లేనిది, అన్ని కాలాలలో వృద్ధిక్షయాలు లేనిది అంతు లేనిది అయిన ఆత్మానందం లభించినా, అది, గమనించి చూస్తే, ఏ సమయంలో అయినా నీకు దాసుడు ఉండడం అనేస్థితి అత్యల్పం కాలం లభిస్తే,దానితో సమానం అవుతుందా!) అని అన్నారు. సమస్తకల్యాణ గుణాత్మకుడై సర్వాపేక్షితాలను అనుగ్రహించేవాడై, ఆదిమధ్యాంత రహితుడై ఉండే ఇతనిని పొందడమే గొప్ప ప్రాప్యం. దీనిని తిరువాయ్ మొళిలో **"ఒరు నాయకమాయ్"** అనే దశకంలో నమ్మాళ్వార్లు వివరంగా ఉపదేశించారు.

3. నారాయణం పరం బ్రహ్మ తత్త్వం నారాయణః పరః ।
నారాయణపరో జ్యోతి రాత్మా నారాయణః పరః ॥
యచ్చ కించిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేపి వా
అంతర్బహి శ్చ తత్ సర్వం వ్యాప్య నారాయణః స్థితః ॥

నారాయణుడే పరబ్రహ్మం, నారాయణుడే పరతత్త్వం, నారాయణుడే పరంజ్యోతి. నారాయణుడే పరమాత్మ. ఈ లోకంలో కన్పించేవి, వినిపించేవి అయిన అన్నిటి లోపల బయట నారాయణుడే వ్యాపించి ఉన్నాడు.

ఈ శ్రుత్యర్థాన్ని కూరేశులు శ్రీవైకుంఠస్తవంలో- "**జ్యోతిః పరం పరమతత్త్వ మథో పరాత్మా బ్రహ్మేతి చ శ్రుతిషు యత్ పరవస్త్వధీతమ్, నారాయణస్తదితి తత్ విశినష్టి కశ్చిత్**" (వేదంలో పరంజ్యోతి అని, పరతత్త్వమని, పరమాత్మ అని పరబ్రహ్మమని పఠింపబడిన పరవస్తువు నారాయణుడే - అని ఒక వేదవాక్యం వివరించింది) అని అన్నారు.

బాణాసురయుద్ధంలో వెన్నుచూపి పారిపోయిన శివుడు శ్రీకృష్ణుని ఉద్దేశించి స్తోత్రం చేసేటపుడు - "**కృష్ణ! కృష్ణ! మహాబాహో! జానే త్వాం పురుషోత్తమమ్, పరేశం పరమాత్మాన మనాదినిధనం పరమ్**" (పొడుగైన బాహువులను కల శ్రీకృష్ణా! నిన్ను పురుషోత్తమునిగా తెలిసికొన్నాను. గొప్పవారికి ప్రభువుగా, ఆదిమధ్యాంతరహితునిగా, వరునిగా, పరమాత్మగా గ్రహించాను) అని, "**త్వం హి బ్రహ్మం పరంజ్యోతిః గూఢం బ్రహ్మణి వాఙ్మయే**" (నీవే వాఙ్మయమైన వేదంలో పొందుపరచబడిన పరబ్రహ్మవు, పరంజ్యోతి) అని పల్కి దీనిని వివరించాడు.

**(నారాయణ పరంబ్రహ్మ)** - "**బ్రహ్మ వా ఇదమగ్ర ఆసీత్**" (సృష్టికి ముందు బ్రహ్మం ఒక్కటే ఉన్నది) అని చెప్పబడినవాడితడే- అని చూపుతున్నది. "**త్వం బ్రహ్మ హి బృహతి బృంహయతీతి తస్మాత్**"- అనేవిధంగా పెద్దవాడు అయినందున ఆశ్రితులను పెద్దవారుగా చేస్తున్నందున, నారాయణుడే పరబ్రహ్మం. అంతు లేని స్వరూపరూపగుణ విభూతులను కల ఇతడే పరబ్రహ్మమని చెప్పదగినవాడు. ఇంకా, తనను ఆశ్రయించినవారిని తనకు సమానంగా చేస్తాడుకదా, శ్రియఃపతి. "**పరమం సామ్యముపైతి**" (ముక్తుడు పరమాత్మతో గొప్పదైన సామ్యాన్ని పొందుతున్నాడు) అని పల్కింది వేదం. "**మమ సాధర్మ్య మాగతాః**" (నాతో సమానమైన గుణాలను కలవారవుతారు) అని వాసుదేవుడు కూడా అన్నాడు. "**తన్నాకవే కొణ్డు**" (తనతో సాటిగా చేసి) అని నమ్మాళ్వార్లు



అన్నారు. "**తమ్మైయేయొక్క అరుళ్‌శెయ్‌వర్**" (తనతో సామ్యాన్ని అనుగ్రహిస్తాడు) అని తిరుమంగైఆళ్వార్లు అన్నారు. స్వరూపవిభుత్వం, జగద్వ్యాపారం, లక్ష్మీపతిత్వం మొదలైనవానిలో తప్ప, మిగిలిన అంశాలలో ముక్తులు ఆ పరమాత్మతో సమానులవుతాయి. స్వరూపగుణాలలో కొంచెం పరత్వాన్ని కల జీవులు, మూలప్రకృతి, నిత్యవిభూతి, నిత్యముక్తులు కొన్ని చోట్ల బ్రహ్మశబ్దంతో నిర్దేశింపబడుతున్నారు. వారికంటే గొప్పవాడైనందున పరబ్రహ్మమని చెప్పబడుతున్నాడని కూడా చెప్పవచ్చు.

**(తత్త్వం నారాయణః పరః)** - నారాయణుడే పరతత్త్వం. వేదం పరత్వనిర్ణయాన్ని చేసే రీతిని గమనించండి. గొప్ప తత్త్వమై ఉండేవాడు నారాయణుడే. దీనివల్ల యథార్థంగా తత్త్వాలు అనేకం అని, వాటిలో గొప్పతత్త్వమై ఉండేవాడు ఇతడే- అని చెప్పబడుతున్నది. అచేతనం అనేది సతత పరిణామాన్ని పొందేది కాబట్టి, చైతన్యరహితమైనది కనుక, పరతత్త్వం కాదు. చేతనులు జ్ఞానశక్తులలో హెచ్చుతగ్గులను కలవారు కనుక పరతత్త్వం అని చెప్పదగినవారు కారు. నిత్యముక్తులు కూడా భగవానునకు పరతంత్రులే కనుక, పరతత్త్వం కారు.

**(నారాయణపరో జ్యోతిః)** - నారాయణుడే గొప్ప జ్యోతి. "**ఏష సంప్రసాదః అస్మాచ్ఛరీరాత్ సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే**" (ఈ జీవుడు ఈ శరీరం నుండి వెలువడి పరంజ్యోతి అయిన పరమాత్మను చేరి, పరమాత్మను చేరి స్వస్వరూపాన్ని పొందుతున్నాడు) అనే వేదవాక్యంలో చెప్పబడిన పరంజ్యోతి ఇతడే - అని దీనివల్ల తెలుస్తున్నది. "**శ్రీకౌస్తుభమ్‌పోలే నమక్కు ప్పరమభోగ్యమాన ఆత్మవస్తువై అడైయప్పెఱ్ఱోమే!**" (కౌస్తుభమణివలె నాకు మిక్కిలి

భోగ్యమైన ఆత్మను పొందగలిగాను కదా!) అనే ఆనందంతో పరమ పురుషుని తిరుమేనిలో ఏర్పడే ప్రకాశాన్ని **"పరంజ్యోతి రుపసంపద్య"** అనే వాక్యం వ్యక్తం చేస్తున్నట్లుగా మన ఆచార్యులు ఇక్కడ మనోజ్ఞంగా వివరించారు. ఆళ్వార్లు కూడా **"ఎన్కణ్ పాశమ్ వైత్త పరమ్ శుడర్ శోదిక్కే"** (నాపట్ల ప్రేమను కల్గిన గొప్పగా ప్రకాశించే పరంజ్యోతి స్వరూపునకు) అని అన్నారు. **"పరంజ్యోతిః"** అని భగవానుని దివ్యమంగళ విగ్రహంలోని కాంతి తెలుపబడుతున్నది. **"న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం నేమా విద్యుతో భాంతి కుతోయ మగ్నిః, తమేవ భాంత మనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి"** (ఆపరమపురుషుని వద్ద సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు ఏమీ ప్రకాశించవు. ఇక అగ్నిని గూర్చి చెప్పవలసినది ఏమున్నది? అతనిని అనుసరించే అన్నీ ప్రకాశిస్తున్నాయి.) అని కదా చెప్పబడింది. **"రుక్మాభమ్"** (బంగారం కాంతివంటి కాంతిని కలవాడు) అని, **"ఆదిత్యవర్ణమ్"** అని పురుషోత్తముని వర్ణించడం అంతా అతని కాంతిలో లవలేశాన్ని అవికల్గి ఉండడం వల్లనే.

పరఞ్జోతి నీ పరమాయ్ నిన్నికழ்న్దు పిన్ మఱ్ఱోర్
పరఞ్జోతి ఇన్మైయిన్ పడియోవి నికழ్కిన్ఱ
పరఞ్జోతి నిన్నుళ్ళే పడరులకమ్ పడైత్త ఎమ్
పరఞ్జోతి కోవిన్దా పణ్బురైక్కమాట్టేనే -

(నీవు అందరి కంటే గొప్పవాడవు. పరంజ్యోతివి. నీకంటే గొప్ప వస్తువు ఇంకొకటి లేనందున, పోలిక లేని రీతిలో ఉండేవాడవు నీవు. పరంజ్యోతి శబ్దం చేత చెప్పదగినవాడవు నీవు. నీ సంకల్పముతో ఈ విశాల లోకాన్ని సృష్టించిన తరువాత ఆ ఆనందం వల్ల నీ మేనిలో గొప్ప తేజస్సును కలిగినవాడవు. గోవిందా! నీ ప్రకారాలు ఇటువంటివి



అయినందున నీ ఉజ్జ్వలత్వాన్ని వర్ణించలేను.)

అని **"వేదమ్ తమిழ் శెయ్ద మాఱన్"** నమ్మాళ్వార్లు **"పరంజ్యోతి"** శబ్దార్థాన్ని ప్రయోగించారు. స్వాభావికంగానే జ్యోతిస్స్వరూపుడై ఉండే నారాయణుడు లక్ష్మీసంబంధంచేత పరంజ్యోతి అవుతున్నాడు. శ్రీసుదర్శనుని చేరికవల్ల పరంజ్యోతి అవుతున్నాడు. లోకాలను సృష్టించి (అపుడు కల్గిన ఆనందాతిశయంచేత) పరంజ్యోతి అవుతున్నాడు. అవతారాలను ఎత్తి పరంజ్యోతి అవుతున్నాడు.

**(నారాయణ పరంజ్యోతిః)** - నారాయణుని కంటే గొప్ప జ్యోతి ఏదీ లేదు. **"మికుమ్ శోతి మేలఱివార్ యవరే?"** అని ఆళ్వార్లు అన్నారు. **"స్వాభావికానవధికాతిశయేశితృత్వం నారాయణ! త్వయి న మృష్యతి వైదికః కః"** (నారాయణా ! సహజమైనది, అంతు లేని పరత్వాన్ని కల్గినదైన నీ ఐశ్వర్యాన్ని ఏ వైదికుడు సహించడు?) అని శ్రీయామును లన్నారు. **"అనన్యపరమాన నారాయణానువాకాదికళాలే ప్రతిపాదిక్కప్పట్ట వైభవత్తై యుడైయ ఉన్ పక్కలిలే పొఱామై కొణ్డాడియిరుప్పాన్ ఒరు వైదికన్ ఉణ్డో? ఉణ్డాకిల్ అవన్ అవైదికనామిత్తనై"** (ఇంక వేఱెవ్వరికీ చెందని నారాయణానువాకాదులలో ప్రతిపాదింపబడిన వైభవాన్ని కల నీపట్ల సహించలేని తనాన్ని ఎవడైనా కల్గి ఉన్నాడా! ఉంటే వాడు వైదికుడు కాడు; అంతే) అని నంబిళ్ళై అన్నారు.

**"విష్ణుభక్తివిహీనో య స్సర్వశాస్త్రార్థవేద్యపి, బ్రాహ్మణ్యం తస్య న భవేత్తస్యోత్పత్తి ర్నిరూప్యతామ్"** (సర్వశాస్త్రాలను తెలిసినవాడైనా, అతడు విష్ణుభక్తి లేనివాడైతే బ్రాహ్మణుడు కాడు. అతని ఉత్పత్తి గమనించి నిరూపించాలి) అని, **"యస్తు నారాయణం ద్వేష్టి తం విద్యాదంత్యరేతసమ్"** (ఎవడు నారాయణుని ద్వేషిస్తాడో, అతడు అంతిమకులంలో పుట్టినవాడని

తెలియాలి) అని కదా చెప్పబడింది.

**(ఆత్మా నారాయణః పరః)- "ఆత్మైవేదమగ్ర ఆసీత్ పురుషవిధః"** (ఈ లోకం మొదట పురుషాకారుడైన ఆత్మగానే ఉన్నది) అని బృహదారణ్యకోపనిషత్తులో చెప్పబడిన ఆత్మ ఇతడే - అని తెలుపబడు తున్నది. ఆత్మలోపల కూడా వ్యాపించి ఉండే అంతరాత్మ అయినందున **"పరమాత్మ"** అని చెప్పబడుతున్నాడు. బద్ధులు, ముక్తులు, నిత్యులు- అనే మూడు రీతులలోని ఆత్మలకంటే గొప్పవాడు. **"పరమాత్మా చ సర్వేషామాధారః పరమేశ్వరః, విష్ణునామా స వేదేషు వేదాంతేషు గీయతే"** (పరమాత్మగా, అందరికి ఆధారంగా, పరమేశ్వరుడుగా ఉండేవాడు - విష్ణువనే పేరు కలవాడు. అతడు అన్ని వేదాలలోను, వేదాంతాలలోను కీర్తింపబడుతున్నాడు) అని ఇది వివరింపబడింది. ఈ నారాయణ సూక్తార్థాన్ని పరాశరమహర్షి - **"అవికారాయ శుద్ధాయ నిత్యాయ పరమాత్మనే"** (ఏ వికారం లేనివాడు, శుద్ధుడు, నిత్యుడు, పరమాత్మయై ఉండేవాడైన విష్ణువునకు) అని ఉపబృంహణం చేశారు. **"అవికారాయ"** అని అంటూ **"అక్షరమ్"** అనే పదాన్ని వివరించారు. ఇందువల్ల అతనికి అచేతనంకంటే గల వ్యత్యాసం చెప్పబడింది. **"దేవమ్"** అనే దానిని **"శుద్ధాయ"** అని వివరించారు. ఇందువల్ల వికారం లేనివారై ఉన్నా అశుద్ధులైన సంసారులకంటే వ్యావృత్తి తెలుపబడింది. **"నిత్యమ్"** అనే దానిని **"నిత్యాయ"** అని వివరించారు. ఇందువల్ల నిత్యశుద్ధులు కాని ముక్తుల కంటే గొప్పవాడని చెప్పబడింది. **"పరః ఆత్మా"** అనేదానిని **"పరమాత్మనే"** అని అనుసంధించారు. దీనివల్ల, నిత్యశుద్ధులైన నిత్యసూరులకంటే గొప్పవాడైన పరమపురుషుడని చెప్పబడింది. **"అవికారాయ..."** ఇత్యాది శ్రీవిష్ణుపురాణ శ్లోకాన్ని ఎజ్గళ్ ఆళ్వాన్ అనుగ్రహించిన వ్యాఖ్యాన శ్రీసూక్తులు ఇక్కడ అనుసంధేయాలు.



**(యచ్చ కించిత్... నారాయణః స్థితః)** - ఈ లోకంలో కన్పించేవి, వినిపించేవి అయిన అన్ని లోకాలను నారాయణుడు లోపల, బయట వ్యాపించి ఉన్నాడు. **"ఆక్కైయుళ్ళుమ్ ఆవి యుళ్ళుమ్ అల్ల పుఱత్తినుళ్ళుమ్, నీక్క మిన్ఱి ఎజ్గుమ్ నిన్ఱాన్"** (శరీరంలో ఉన్నాడు, ఆత్మలో ఉన్నాడు, ఇంకా మిగిలిన అన్ని వస్తువులలో ఉన్నాడు. ఏ లోటు లేకుండా అంతటా వ్యాపించి ఉన్నాడు) అని, **"ముఱ్ఱక్కరన్దొళిత్తాయ్!" (10-10-8)** (అంతటా వ్యాపించి ఉన్నావు) అని ఈ అర్థాన్ని ఆళ్వార్లు అనుగ్రహించారు. **"విశ్వాత్మానమ్"** అని పూర్వం పల్కినది ఇక్కడ వివరింపబడింది.

**(నారాయణః)-** వేదం నారాయణ నామపారాయణం చేయడాన్ని గమనించండి. అష్టాక్షరిలో ప్రధానమైన నారాయణశబ్దాన్ని వేదం అష్టావృత్తి (ఎనిమిదిసార్లు) అధ్యయనం చేస్తున్నది. సాటి మేటి లేని, అనన్యపరమైన తిరునామం కదా, ఇది.

**"పరం బ్రహ్మ"** అని అన్నందున పురుషోత్తముని గొప్పతనాన్ని (పరత్వాన్ని) తెల్పుతున్నది. **"పరం తత్త్వమ్"** అని అన్నందున తత్త్వత్రయంలో గొప్ప తత్త్వం ఇతడే - అని తెలుపబడింది. **"పరంజ్యోతిః"** అని అన్నందున సాటి మేటి లేని అందాన్ని కల్గినది, జ్యోతిర్మయమైనది అయిన దివ్యమంగళ విగ్రహాన్ని కలవాడని చెప్పబడింది. **"పరమాత్మా"** అని సకల చేతనులకంటే గొప్పవాడని తెలుపబడింది. ఇటువంటి నారాయణుడు లోకాలన్నిటిలోను లోపల బయట వ్యాపించి ఉన్నాడు- అని ఘోషింపబడింది.

**4. "అనంత మవ్యయం కవిం సముద్రేంతం విశ్వశంభువమ్"**

లెక్కకట్టడానికి సాధ్యం కాని అవతారరూపాలను కలవాడు, ఆ విధంగా అనేకంగా అవతరించినా ఏ దోషాలు లేనివాడు, అందంగా

పలికేవాడు, క్షీరాబ్ధి నడుమ శయనించి ఉండేవాడు, లోకానికి అంతటికి మంచిని చేసేవాడు నారాయణుడే

ముందు మంత్రంలో **"పరబ్రహ్మ, పరతత్త్వమ్"** ఇత్యాది శబ్దాలతో పరత్వానుభవాన్ని వేదం పొందింది. ఇక్కడ అర్చావతార పర్యంతమైన అవతారాలను అనుభవిస్తున్నది. శ్రీవైకుంఠనాథుడు పరమపదంలో పగటి దీపంవలె మిణుకు మిణుకుమని ప్రకాశిస్తాడు. అజ్ఞానం నిండిన ఈ లోకంలో అవతరించి చీకటి వెల్గించిన దీపంవలె గొప్పగా ప్రకాశిస్తాడు. తొండరడిప్పొడి ఆళ్వార్లు కూడా **"అమరరేఱే"** (నిత్యసూరినాథా!) అని పరత్వాన్ని అనుసంధించి, **"ఆయర్‌తమ్ కొழுన్దే"** (గోపాలబాలా!) అని దానికంటే గొప్పదైన సౌలభ్యాన్ని అనుసంధించారు కదా! **"కణ్ణావాన్ ఎన్ఱుమ్ మణ్ణోర్ విణ్ణోర్‌క్కు, తణ్ణార్ వేఙ్గడవిణ్ణోర్ వెఱ్పనే"** (భూలోక వాసులకు, పరమపదవాసులకు చల్లని తిరుమలకు ప్రభువైన వేంకటేశుడు నేత్రస్థానీయుడు) అనే రీతిలో నిత్యసూరులు, సర్వస్మాత్ పరుడు తనను తక్కువ చేసికొని ఉండే ఈ స్థితిని దర్శించడం కోసం ఇక్కడకు వస్తాడని కదా చెప్పబడింది. మన ఆళ్వార్లు ఆచార్యులు అర్చావతారరూపుని పరమపదనాథుని విభూతిగా భావించారు. శ్రీవైకుంఠనాథునే అర్చామూర్తి యొక్క విభూతిగా పల్కుతారు.

> శ్రీమద్వ్యోమ న సీమ వాఙ్మనసయోః సర్వేవతారాః క్వచిత్
> కాలే విశ్వజనీనమేదదితి ధీః శ్రీరంగధామన్యథ।
> ఆర్తస్వాగతికైః కృపాకలుషితై రాలోకితైరార్ద్రయా
> విశ్వత్రాణవిమర్శనస్ఖలితయా నిద్రాపి జాగర్యయా ॥

(పరమపదం వాక్కుకు, మనస్సుకు అందనిది; విభవావతారాలు ఏదో ఒక సమయంలో సంభవించి ముగిసినవి; అర్చావతారమే సర్వజను లకు హితమైనది - అని భావించి, శ్రీరంగంలో ఆర్తిని పొందినవారికి



స్వాగతాన్ని పలికేవి, దయతో కలిగి ఉన్నవి అయిన కటాక్షాలతో సంసారు లను చల్లబఱచి, వేంచేసి ఉండే నీవు జగద్రక్షణ చింతతో జాగరూకుడవై ఉంటూనే కన్నులు మూసికొని ఉన్నావు) అనే భట్టర్ శ్రీసూక్తి ఇక్కడ అనుసంధేయం.

**(అనంతమ్)** - లెక్కలేనన్ని అవతారరూపాలను కలవాడు. **"అనంతరూపమ్"** అని ప్రథమానువాకంలో పల్కినది స్మరింపజేస్తున్నది. **"అంతః సముద్రనిలయం యమనంతరూపమ్"** (పాలసముద్రంలో పరుండి ఉండేవాడు, అంతు లేని అర్చావతారరూపాలను కలవాడైన ఎవనిని) అని కూరేశులు ఈ మంత్రార్థాన్ని శ్రీవైకుంఠస్తవంలో సంగ్రహించారు. **"అజాయమానో బహుధా విజాయతే"** (జన్మ లేనివాడైనా, పలు విధాలుగా అవతరిస్తున్నాడు) అని వేదం పల్కింది. **"పిఱప్పిల్ పల్‌పిఱవి ప్పెరుమాన్"** (కర్మకృతమైన జన్మ లేకపోయినా, దయా మూలకాలైన పలు జన్మలను కలవాడు) అని, **"శన్మమ్ పలపల శెయ్‌దు"** (పలు జన్మలను ఎత్తి) అని ఆళ్వార్లు అనుగ్రహించారు. **"బహూని మే వ్యతీతాని జన్మాని"** (నాకు పలు జన్మలు గడిచాయి) అని సర్వేశ్వరుడు పలికాడు. ఇతని అవతారాలు అంతు లేనివి కదా! **"మిక్క పల్ మాయఙ్గళాల్ వికిరుతమ్ శెయ్‌దు వేణ్డుమురువుమ్ కొణ్డు"** (గొప్పవైన పలు మాయలతో వికారాన్ని కల్గించి, తాను కోరిన అవతార రూపాలను పరిగ్రహించి) అనే రీతిలో కదా ఇతడు పలు అవతార రూపాలను పరిగ్రహించాడు. **"ఉయిరళిప్పాన్ ఎన్నిన్ఱ యోనియుమాయ్ ప్పిఱన్ద"** (జీవులను రక్షించడం ఎన్నో జాతులలో అవతరించిన) స్వామి కదా ఇతడు. రామకృష్ణాది రూపాలతో అవతరించి, చేతనులను ఉజ్జీవింపజేస్తున్నాడు. **"హృదా మనీషా మనసాభిక్లుప్తః"** (నిశ్చలమైన భక్తితో కూడిన మనస్సులో నిలుపబడినవాడు) అని ఈ నారాయణవల్లిలోని

మొదటి అనువాకంలో చెప్పబడిన అర్చావతారం ఇక్కడ **"అనంతమ్"** అని అనడంద్వారా సూచింపబడింది. ఇక్కడ వ్యాఖ్యానించిన నారాయణ యతి కూడా **"యత్స్వరూపో మద్రూపో యద్గుణో మద్విభూతికో, యత్ప్రమాణకో యద్ద్రవ్యోయం సర్వేశ్వరః కల్ప్యతే, స తథా భవేదితి భావః"** (ఎటువంటి స్వరూపాన్ని కలవాడుగా, ఏ రూపాన్ని కలవాడుగా, ఏ పరిమితిని కలవాడుగా, ఏ ద్రవ్యాన్ని కలవాడుగా సర్వేశ్వరుడు కల్పింప బడుతున్నాడో, అతడు ఆ విధంగానే అతడు అవుతున్నాడు) అని అర్చావతారపరంగా వివరించారు కదా! ఈ అర్థాన్ని గీతాచార్యుడు **"యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్"** (ఎవరు ఏ విధంగా కావాలని తలచి నన్ను పూజిస్తారో, వారినిగూర్చి ఆ విధంగానే ఆశ్రయించడానికి తగినట్లుగానే నన్ను మలచుకొంటాను) అని అన్నాడు. ఆళ్వార్లు కూడా **"తమరుకన్దదు ఎవ్వురువమ్ అవ్వురువమ్ తానే"** (భక్తులు అభిమానించినది ఏ రూపమో, ఆ రూపాన్నే కలవాడవుతాడు) అని, **"నెఞ్జినాల్ నినైప్పాన్ యవన్ అవనాకుమ్ నీళ్‌కడల్ వణ్ణనే"** (ఒకడు మనస్సులో ఏ రూపాన్ని తలుస్తాడో, సముద్రవర్ణుడు ఆ రూపాన్ని కలవాడవుతాడు) అని అన్నారు. ఈ విధంగా గ్రామాలలో, గృహాలలో అర్చావతారాన్ని ఎత్తి వేంచేసి ఉంటాడు - అనే విషయాన్ని **"అనంతమ్"** అనే పదం చూపుతున్నది.

**"ఆస్తాం తే గుణరాశివత్ గుణపరీవాహాత్మనాం జన్మనాం సంఖ్యా భౌమనికేతనేష్వపి కుటీకుంజేషు రంగేశ్వర!, అర్చ్య స్సర్వసహిష్ణు రర్చక పరాధీనాఖిలాత్మస్థితిః ప్రీణీషే హృదయాలుభి స్తవ తత శ్శీలాజ్జడీ భూయతే"** (శ్రీరంగనాథా! నీ గుణసమూహాల సంఖ్యవలె, ఆ గుణాల పరీవాహరూపాలైన అవతారాల సంఖ్య కూడా అనేకంగా ఉండనీ! లోకం లోని ఆలయాలలో, గృహాలలో, ఆశ్రమాలలో ఆరాధించదగిన వాడవై, దేనినైనా ఏ అపరాధాన్ని అయినా సహించేవాడవై, అర్చకులకు అన్ని స్థితులలో పరతంత్రమై ఉండేవాడవై ఆనందిస్తున్నావు. అటువంటి నీ శీలగుణాలతో ఆర్ద్రహృదయాన్ని కల దివ్యసూరులు మొదలైనవారిని మోహింపచేస్తున్నావు) అని భట్టర్ పల్కిన సూక్తి అనుసంధేయం.



**"అనంతమ్"** మొదలైన పదాలు పరత్వాన్నే తెల్పుతున్నవిగా కూడా గ్రహించవచ్చు.

**(అనంతమ్)** దేశంవల్ల, కాలంవల్ల, వస్తువువల్ల పరిమితిని లేనివాడు. **"నిత్యమ్"** అని కాలపరిచ్ఛేద రాహిత్యం అనుసంధిపబడు తున్నది. **"విశ్వమ్"** అని వస్తుపరిచ్ఛేదరాహిత్యం తెలుపబడుతున్నది. **"యచ్చ కించిత్... స్థితః"** అని దేశం వల్ల పరిచ్ఛేదాన్ని కలిగి ఉండకపోవడాన్ని చూపబడింది. ఈ మూడు విధాలైన పరిచ్ఛేదాలను లేనివాడని వాటిని మూడిటిని ఇక్కడ కలిపి ఏకత్ర వేదం అనుసంధిస్తున్నది.

**(అనంతమ్)- "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ"** అనే వేదవాక్యంలో చెప్పబడినవాడు నారాయణుడే - అని దీనిద్వారా నిర్ణయించి పల్కు తున్నది.

**(అనంతమ్)** - భగవానుడు ఆదరించి అభిమానించిన తిరునామా లలో ఇదికూడా ఒకటి. సత్యజ్ఞానాదులవలె స్వరూపనిరూపకమైన నామం కదా, ఇది.

**(అవ్యయమ్)** - కొఱత - లోటు - లేనివాడు - అని అర్థం. పైన తెల్పిన రీతిలో పలు జన్మలను ఎత్తినా, కొంచెంకూడా కొఱత లేనివాడు మిగిలినవారికి, వారు జన్మించగా - జన్మించగా జ్ఞానం మసకబారుతుంది. (మొక్కపోతుంది) ఇతడు అవతరించగా, అవతరించగా గొప్పతనాన్ని

పొందుతున్నాడు. **"బహుదా విజాయతే"** (పలు విధాలుగా విశేషంగా జన్మిస్తున్నాడు) అని, **"స ఉ శ్రేయాన్ భవతి జాయమానః"** (అతడు జన్మించిన తరువాతనే గొప్పవాడవుతున్నాడు) అని వేదాలు ఘోషిస్తున్నాయి. **"నిలై వరమ్బిల పల పిఱప్పాయ్ ఒళివరు ముழுనలమ్"** (అంతు లేని పలు జన్మలను కలవాడై, ప్రకాశించే జ్ఞానానందస్వరూపుడు) అని ఆழ்వార్లు పలికారు. **"జన్మ కర్మ చ మే దివ్యమ్"** (నా అవతారాలు, లీలలు అప్రాకృతాలు) అని చాలా గౌరవంతో కదా స్వామి తన అవారాలను గూర్చి పలికాడు.

**(కవిమ్)** - చక్కగా మాట్లాడేవాడు. అవతారాలను ఎత్తిన తరువాత చేసే కార్యాన్ని ఇది పల్కుతున్నది. ఇక్కడ భాషణాన్ని (పలుకడాన్ని) మాత్రం ప్రస్తావించడం మందహాసం చేయడం, చల్లగా చూడడం, ఆలింగనం చేసికోవడం మొదలైనవానికికూడా ఉపలక్షణం. **"హసితం భాసితం చైవ"** (నవ్వడం, పల్కడంకూడా) అని వాల్మీకి మహర్షికూడా వీటిలో అభినివేశాన్ని పొందారు కదా! **"నిన్ శెజ్ఞనివాయిన్ కళ్వ ప్పణిమొழி నినైదొఱుమ్ ఆవి వేమాల్!"** (ఎర్రని అదరాన్ని కల వంచకుడా! నీ అందమైన పలుకును స్మరించినపుడంతా నా ప్రాణం తపిస్తున్నది. అయ్యో!) అని పురుషోత్తముని పలుకులో ఆழ்వార్లు కూడా అభినివేశాన్ని పొందారు. "అనవధికదయాసౌహార్దానురాగ గర్భావలోకనాలాపామృతైః **విశ్వమాప్యాయయంత్యా"** (అంతు లేని దయను, మంచి భావనను, ప్రీతిని కల్గినవి, అమృతంవంటివి అయిన చూపులతోను, మాటలతోను, లోకాన్ని అంతటిని ఉజ్జీవింపజేస్తూ) అని శ్రీభాష్యకారులు గీతాభాష్యావ తారికిలో పలికారు. **"ఆశయా యది వా రామః పునశ్శబ్దాపయేదితి"** (మళ్ళీ తిరిగి శ్రీరాముడు వచ్చి పలుకరిస్తాడో! ఏమో!- అనే ఆశతో) అనే విధంగా తిరిగి శ్రీరాముని తీయని గొంతును వింటానా! అని



సుమంత్రుడు ఆశపడిన పలుకుకదా, ఇతని పలుకు.

**(కవిమ్) - "అభివదన్ యదాస్తే"** అని పురుషసూక్తంలో చెప్పబడిన రీతిలో అన్ని శబ్దాలను ఉచ్చరించేవాడనే అర్థాన్ని గ్రహించవచ్చు. **"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై"** (ఏ పురుషోత్తముడు బ్రహ్మను మొదట సృష్టించాడో, ఎవడు ఆ బ్రహ్మకు వేదాన్ని ఉపదేశించాడో) అనే విధంగా వేదాన్ని మొదట ఉచ్చరించినవాడనే అర్థాన్ని గ్రహించవచ్చు. **"పణ్ణార్ పాడల్ ఇన్ కవికళ్ యానాయ్ త్తన్నైత్తాన్ పాడి"** (రాగాలు నిండిన పాశురాలను నా ద్వారా తననే తాను కీర్తించుకొని) అనేవిధంగా ఋషులు, ఆழ்వార్లు మొదలైనవారిని నిమిత్తమాత్రంగా గ్రహించి, తనను తానే కీర్తించుకొనేవాడు- అనే అర్థాన్ని గ్రహించవచ్చు. ఎవరిని గూర్చి కవిత్వాన్ని పల్కినా, అది వస్తుస్వభావాన్ని బట్టి ఇతనినే కదా తెల్పుతుంది. సర్వశబ్దవాచ్యుడితడే కదా! దీనినే ఆழ்వార్లు కూడా **"నుమ్ కవి కొణ్డు నుమ్ నమ్ ఇట్టా దెయ్వ మేత్తినాల్ శెమ్మిన్ శుడర్ముడి ఎన్ తిరుమాలుక్కు చ్చేరుమ్"** (మీ కవిత్వంతో మీకు మీకు ఇష్టమైన దైవాలను స్తుతిస్తే, అది అందంగా ప్రకాశించే కిరీటాన్ని కల నా లక్ష్మీవల్లభునకే చేరుతుంది) అని అన్నారు.

ఇక, తరువాత పూర్వం ప్రస్తావించిన అవతారాలకు మూలమైన అవతారం క్షీరాబ్ధినాథుని గూర్చి పల్కుతున్నది.

**(సముద్రేంతమ్)** - క్షీరాబ్ధిలో శయనించి ఉండేవాడు- అని అర్థం. **"అంతః"** అనే పదం స్థానాన్ని తెల్పుతుంది. **"ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః, నాగపర్యంక ముత్సృజ్య హ్యాగతో మధురాం పురీమ్"** (క్షీరాబ్ధిలో శయనించి ఉండే శ్రీమన్నారాయణుడే ఆదిశేషుడనే శయనాన్ని వీడి మధురకు శ్రీకృష్ణుడై వచ్చాడుకదా) అని కదా చెప్పబడింది. ఈ నారాయణవల్లి ఆరంభంలో కూడా **"అంభస్య పారే"** అని క్షీరాబ్ధినాథుని

ఉద్దేశించి పలుకబడింది. మధ్యలో కూడా **"యమంతః సముద్రే కవయే వయంతి"** (ఏ పరమపురుషుని క్షీరాబ్ధిలో ఉండేవానినిగా కవులు తెలిసికొంటున్నారో) అని దీనినే తెల్పుతున్నది. ఇక్కడ **"సముద్రేంతమ్"** అని వేదం ఉద్ఘోషించింది. సర్వేశ్వరుడై ఉండేవాడు, తనను ఆశ్రయించిన వారిని రక్షించడం కోసం, ఆశ్రితవిరోధులను నిరసించడం కోసం, తనచే సృష్టింపబడిన బ్రహ్మకు, శివునకు నడుమ సామాన్యులు బ్రహ్మ రుద్రులతో సమానుడుగా తలచేటట్లుగా అవతరించిన వాని స్థితిని అనుసంధించి పరవశించి పలవరిస్తున్నది, వేదం. ఆళ్వార్లు కూడా ఈ సౌలభ్యగుణాన్ని అనుసంధించి కదా క్షీరాబ్ధినాథునిపట్ల అభినివేశాన్ని పొందారు. **"నాకమేఱి నడుక్కడలుళ్ తుయిన్ద నారాయణనే!"** (ఆదిశేషుని అధిష్ఠించి, సముద్రం మధ్యలో నిద్రించే నారాయణా!) అని నమ్మాళ్వార్లు అన్నారు. **"పాఱ్కడలుళ్ పైయిత్తుయిన్ద పరమన్"** (పాలకడలిలో ఆదిశేషునిపై నిద్రించే పరమాత్మ) అని గోదాదేవి అనుగ్రహించారు. **"పైయరవినణై ప్పాఱ్కడలుళ్ పళ్ళికొళ్కిన్ద పరమమూర్త్తి"** (ఆదిశేష శయనంపై పాల కడలిలో శయనించిన పరమాత్మ) అని పెరియాళ్వార్లు అన్నారు.

**(సముద్రేంతమ్) - "కుఱైవిల్ తడఙ్కడల్"** (ఏ కొరత లేని చల్లని సముద్రం) అని ఆళ్వార్లచే కీర్తింపబడిన సముద్రంలో వేంచేసి ఉండేవాడు. యశోదాదేవి బాలకృష్ణుని తన ఒడిలో పరుండబెట్టుకొని సంతోషించినట్లుగా, సర్వేశ్వరుని తనలో పెట్టుకొని, అందువల్ల ఆనందించి, సముద్రం కోరికను తీర్చుకొంటున్నది. లక్ష్మీదేవి పుట్టిన ఇల్లు కనుక ఇది సర్వేశ్వరునకు మామగారి గృహంకదా. **"శ్వశురగృహో స్వర్గతుల్యో నరాణామ్"** (మామగారి ఇల్లు స్వర్గంతో సమానం) అనే విధంగా



భగవానుడు మిక్కిలిగా అభిమనించే చోటు, ఇది.

**(సముద్రేంతం విశ్వశంభువమ్)** - పాలకడలిలో వేంచేసి ఉండి లోకానికి హితాన్ని కల్గించేవాడు. **"శాపముళ్ళన నీక్కువానై త్తడఙ్గడల్ కిడన్దాన్ తన్నై"** (అనిష్టనివృత్తిని చేసేవానిని, విశాలమైన పాలకడలిలో శయనించిన వానిని) అని అన్నారు, నమ్మాళ్వార్లు. "ఈ లోకాలకు ఆపద కల్గినపుడు నాకోసం వారు అన్వేషిస్తూ తిరుగకూడదు" - అని ఈ సముద్రంలోనే శయనించి ఉండేవాడు. ఆర్తుల పిలుపును వినే చోటు కదా, ఇది. (పాలకడలి)

**(సముద్రేంతం విశ్వశంభువమ్)- "కుఱైవిల్ తడఙ్కడల్ కోళరవేఱి త్తన్ కోల చ్చెన్దామరైక్కణ్ ఉఱైపవన్పోల్ ఓర్ యోగుమణర్న్ద ఒళిమణివణ్ణన్"** (ఏ లోటు లేని చల్లని సముద్రంలో గొప్ప బలాన్ని కల ఆదిశేషుని అధిరోహించి, తన అందమైన ఎఱ్ఱని తామరలవంటి నేత్రాలను నిద్రించేవానివలె మూసి, యోగంలో నిద్రించే, ప్రకాశించే మణివంటి వర్ణాన్ని కలవాడు) అని అన్నాడు నమ్మాళ్వార్లు. "జీవులంతా నన్ను ఆశ్రయించి ఉజ్జీవించే దారి ఏదో?" అని చింతిస్తూ శయనించి ఉండేవాడు. నిద్రించడం - అనేది నామమాత్రమై, తద్ద్వారా జగద్రక్షణ చింతను చేసేవాడు. రక్షణోపాయ చింతవల్ల నాలుక పిడుచ కట్టినపుడు **"ఆత్మానం వాసుదేవాఖ్యం చింతయన్"** (వాసుదేవరూపుడైన తనను భావిస్తూ ఉండేవాడు) అనే విధంగా తనను తానే ధ్యానించేవాడు.

**(విశ్వశంభువమ్ అనంతమ్)**- ఈ విధంగా ధ్యానించగానే, అవతారాన్ని ఎత్తడమే దీనికి ఉపాయమని తోస్తుంది. వెంటనే పలు అవతారాలను ఎత్తుతాడు. ఇక్కడ ప్రస్తావింపబడిన అవతారాలు ఇతిహాసపురాణాలలో వివరంగా వర్ణింపబడ్డాయి. అర్చావతారాన్ని గూర్చి

పాంచరాత్రం, వైఖానసం మొదలైన ఆగమాలు విస్తృతంగా పల్కుతున్నాయి. శంకరులు, పంచమవేదమైన పాంచరాత్రాగమాన్ని ప్రమాణంగా అంగీకరించారు. అందులో, జీవోత్పత్తి చెప్పబడినదిగా ఉపక్రమించి, దానిని మాత్రం అంగీకరించడంలేదు - అని, మిగిలిన విషయాలు ప్రమాణమేనని అన్నారు. ఈ రీతిలో వేదం భగవానుని అవతారవైభవాన్ని ఇక్కడ అనుసంధించింది.

5. పద్మకోశప్రతీకాశం హృదయం చాప్యధోముఖమ్।
అధోనిష్ట్యావితస్త్యాం తు నాభ్యా ముపరి తిష్ఠతి ॥
హృదయం తద్విజానీయాత్ విశ్వస్యాయతనం మహత్ ।
సంతతం సిరాభిస్తు లంబత్యాకోశసన్నిభమ్ ॥

తస్యాంతే సుషిరం సూక్ష్మం తస్మిన్ సర్వం ప్రతిష్ఠితమ్।
తస్య మధ్యే మహానగ్నిర్విశ్వార్చిర్విశ్వతోముఖః ॥
సోऽగ్రభుక్ విభజన్ తిష్ఠన్ ఆహార మజరః కవిః ।
సంతాపయతి స్వం దేహ ముపాదతలమస్తకమ్ ॥

కంఠంలో మూలదేశానికి కింద, ఉదరానికి పైభాగంలో బొటనవేలు పరిమాణంలో, తామరమొగ్గవలె, తలక్రిందులుగా హృదయమున్నది. ఆ హృదయాన్ని, లోకానికి ఆత్మయై ఉండే నారాయణునకు గొప్ప నివాసస్థానంగా తెలియాలి. కొంచెం వికసించిన తామరమొగ్గతో పోలిన ఆ హృదయం ఎల్లప్పుడు సిరలతో వేలాడుతూ ఉంటుంది. ఆ హృదయం నడుమ సూక్ష్మమైన ద్వారం ఉన్నది. ఆ ద్వారంలో సర్వాత్మ అయిన నారాయణుడున్నాడు. దాని నడుమ, అంతటా వ్యాపించిన జ్వాలా సమూహాన్ని కల్గినది, అన్ని చోట్ల వ్యాపించి ఉండేదైన గొప్ప జాఠరాగ్ని ఉన్నది. ఆ అగ్ని ఆరనిది. ప్రకాశిస్తూ, భుజించిన ఆహారాన్ని విభజిస్తూ, భుజించిన దానిని మొదట భుజిస్తూ, తన (జీవుని) దేహాన్ని అరికాలు మొదలు తలవరకు మిక్కిలి తాపాన్ని పొందిస్తున్నది.



ఇంతకు ముందు మంత్రంలో అవతార వైభవాన్ని అనుసంధించిన తరువాత, ఇందులో భగవంతుని అంతర్యామ్యవస్థనుగూర్చి వేదం అనుభవిస్తున్నది. ఈ సూక్తంలో మొదట పరత్వావస్థ తెలుపబడింది. అది ఈ లోకంలోనివారికి దరిచేరడానికి సాధ్యం కానిది. అందువల్ల అనంతరం వ్యూహవిభవావతారాలు వివరింపబడ్డాయి. వ్యూహం అయితే - సనకసనందనాది మహాత్ములకే దరి చేరడానికి సాధ్యమైనది. విభవావ తారాలు ఆ కాలంలో ఉండే అర్జునవిభీషణాదులవంటి అదృష్టవంతులకు మాత్రమే అనుభావ్యమైనది. అర్చావతారం కూడా, సౌలభ్యానికి పరమావధిసీమ అయినా, మాంసచక్షువులకు గోచరమైనా, రెండు విధాలైన ఆపదలకు లక్ష్యం కాదగినది. క్రిమికంఠుడు తిల్లై గోవిందరాజస్వామి మూలవిగ్రహాన్ని ముక్కలు ముక్కలుగా చేసి, సముద్రంలో పారవేయించాడు కదా! మ్లేచ్ఛులు కూడా ఆ విధంగానే చేశారు. ఇది అర్చావతార తిరుమేనికి కలిగే ఆపద. శాస్త్రవిరుద్ధంగా కార్యాలను చేసి మూర్తిలో భగవత్ సాన్నిధ్యాన్ని పోగొట్టడం ఆ మూర్తి ప్రాణానికి కలిగే ఆపద. అయితే, అంతర్యామ్యవస్థకు పై రీతిలోని రెండు ఆపదలకు అవకాశం లేదు. అనాచారమనే దోషమే కలుగదు. అందువల్ల అది ఈ సూక్తంలో చివరగా అనుభవింపబడుతున్నది. ఆళ్వార్లు **"కిళరొళియిళమై"** అనేదశకంలో (2-10) భగవానుని దివ్యదేశమైన తిరుమాలిరుమ్ శోలైను ఆనందంగా దర్శించి ఆనందించినట్లే, అచ్యుతుడు అమరి ఉండి నివసించే చోటయిన హృదయాన్నిగూర్చి విరివిగా పల్కి వేదం ఆనందిస్తున్నది. వేదం అన్వేషించినా చూడలేని మాధవుడు మనస్సులో మన్నికగా నిలచి ఉన్నాడని ఈ ఉపనిషత్తు ఉద్ఘోషిస్తున్నది. దీనికి ముందు, అన్ని

పరవిద్యలలో ఉపాసింపబడేవాడు నారాయణుడే - అని నిర్ణయించింది. ఇక్కడ, ముందు అనువాకంలో చెప్పబడిన దహరవిద్యలో కూడా ఉపాసింపబడేవాడు అతడే - అని నిర్ణయిస్తున్నది. **"హృది తిష్ఠతి యోగినామ్"** (యోగుల హృదయంలో నిలచి ఉంటాడు) అని కదా చెప్పబడింది.

**(పద్మకోశప్రతీకాశం హృదయమ్)** - తామరమొగ్గవలె ఉండే హృదయం. ఇదే పెరియాళ్వార్లచే **"పోదిల్ కమలవన్నెఞ్జమ్"** (తామర పవ్వు వంటి హృదయం) అని అనుసంధింపబడింది.

**(అధోముఖమ్)** - తలక్రిందులుగా ఉండే హృదయం.

**(అధోనిష్ట్యా... తిష్ఠతి)**- కంఠమూలానికి కింది భాగంలో, నాభీప్రదేశానికి పైన బొటనవేలు పరిమాణంలో ఈ హృదయం ఉన్నది. **"అంగుష్ఠమాత్రః పురుషః"**- (బొటనవేలు పరిమాణం కల్గిన పురుషుడు) అని పలు వేదవాక్యాలలో చెప్పబడినది ఇక్కడ స్మరింపబడుతున్నది.

**(హృదయం తద్విజానీయాత్ విశ్వస్యాయతనం మహత్)** - ఆ హృదయాన్ని లోకానికి అంతటికి అద్వితీయప్రాణమైన **"ఉలకజ్ఞట్కెల్లామ్ ఓరుయిర్"** (లోకానికి అంతటికి అద్వితీయ ప్రాణం) నారాయణుడు ఉండే గొప్ప కోవెలగా తెలియాలి.

**(ఆయతనం మహత్)** - సర్వవ్యాపి అయిన భగవంతునకు బొటనవేలు పరిమాణం గల ఈ హృదయాన్ని గొప్ప కోవెలగా పల్కడం తగునా?- అనే ప్రశ్న కల్గుతుంది. పురుషోత్తముడు వైకుంఠం కంటే దివ్యదేశాలనంటే తనను ఆశ్రయించినవారి హృదయాన్నే ఎక్కువగా అభిమానించి ఆదరిస్తాడు కనుక, ఇక్కడ అది గొప్ప కోవెలగా చెప్పబడుతున్నది. నమ్మాళ్వార్లు కూడా **"నెఞ్జమే నీళ్నకరాక ఇరున్ద"** (మనస్సే విశాలమైన నగరంగా వేంచేసి ఉండేవాడు) అని అన్నారు. పెరియాళ్వార్లు కూడా **"వడతడముమ్ వైకున్దముమ్ మదిళ్ తువరాపతియుమ్ ఇడైవకైకళ్ ఇకళ్న్దిట్టు ఎన్బాల్ ఇడవకై కొణ్డనైయే"** (పాలకడలి, వైకుంఠం, కోటలను కల ద్వారక అన్నిటినీ వదలిపెట్టి నా హృదయంలో స్థానాన్ని పొందావుకదా) అని అన్నారు.



**(ఆయతనమ్ మహత్)**- శ్రీవైకుంఠం వ్యూహవిభవ అర్చావతారాల కంటే భగవంతుడు మిక్కిలిగా ఆదరించే చోటు. **"కల్లుమ్ కనైకడలుమ్ వైకున్దవానాడుమ్ పుల్లెన్ఱొళిన్దనకొల్! ఏ పావమ్! వెల్ల నెడియాన్ నిఱమ్ కరియాన్ ఉళ్ పుకున్దు నీఙ్గాన్ అడియేనదుళ్ళత్తకమ్"** (వేంకటాద్రి, ఘోషించే పాలకడలి, వైకుంఠమహానగరం పాడుబడిపోయాయే! అయ్యో! పరాత్పరుడు, నల్లనివాడైన స్వామి నాలో ప్రవేశించి తొలగిపోవడంలేదు) అని నమ్మాళ్వార్లు అన్నారు. **"నిఱ్పదుమ్ ఓర్ వెఱ్పకత్తు ఇరుప్పుమ్ విణ్కడప్పదుమ్ నఱ్పెరున్దిరైక్కడలుళ్ నానిలాద మున్నెలామ్, అఱ్పుదన్ అనన్దశయనన్ కిడప్పదుమ్ ఎన్ నెఞ్జమే"** (పూర్వం స్వామి నిలచి ఉండడం వేంకటాద్రిపై, వేంచేసి ఉండడం పరమపదంలో, శయనించడం పాల కడలిలో, ఇదంతా నాలో ఉండడానికి ముందు. ఇపుడు ఆశ్చర్య చేష్టితుడు, అనంతశయనుడు అయిన స్వామి నిలువడం, కూర్చోవడం, శయనించడం అంతా నామనస్సులోనే) అని అన్నారు తిరుమళిశైప్పిరాన్.

**(ఆయతనం మహత్)** - "ఈ చేతనుని సంస్కరించడం వీలవుతుందా? అనే ఆశతో అన్ని దోషాలకు నిలయమైన దీనినే పరమభోగ్యమైన వాసస్థానంగా చేసికొని ఉంటాడు. కనుక వాత్సల్యగుణం ప్రకాశించే చోటు. **"అనశ్నన్ అన్యో అభిచాకశీతి"** (పరమాత్మ, కర్మఫలాలను భుజించకుండా, గొప్పగా ప్రకాశిస్తున్నాడు) అని కదా వేదం పల్కింది.

**(ఆయతనం మహత్)** - ఉపాసకులు పురుషోత్తముని పలు స్థానాలలో ఉన్నవానినిగా భావించి ఉపాసన చేస్తారు. ఆ స్థానాలలో గొప్పది హృదయమనే అర్థాన్ని కూడా గ్రహించవచ్చు. **"ఉదర ముపాస్తే య ఋషి వర్త్మసు కూర్పదృశః, పరిసరపద్ధతిం హృదయమారుణయో దహరమ్, తత ఉదగాదనంత ! తవ ధామ శిరః పరమమ్, పునరిహ యత్ సమేత్య న పతంతి కృతాంతముఖే"** (అనంతా! ఉపాసనమార్గాలలో సూక్ష్మదృష్టులైన, అరుణవంశంలో పుట్టిన కొందఱు హృదయాకాశంలో ఉండే నిన్ను ఉపాసిస్తున్నారు. కొందఱు హృదయంలో చుట్టూ వ్యాపించి ఉన్నది, నిన్ను ఉపాసించే చోటు, అయిన శిరస్సువరకు దీర్ఘంగా ఉండే సుషుమ్నానాడిలో ఉపాసిస్తున్నారు. ఈ ఉపాసకులంతా ఈ సుషుమ్నా నాడిని చేరి, తిరిగి సంసారాన్ని పొందడం లేదు) అని శ్రీభాగవతంలోని శ్రుతిగీతలలో పల్కిన పలు ఉపాసనలలో గొప్పదైన ఈ హృదయాకాశం- అని తాత్పర్యం. ఈ హృదయంలో కదా భగవానుడు తన అసాధారణమైన దివ్యమంగళవిగ్రహంతో వేంచేసి ఉంటాడు.

**(ఆయతనం మహత్)** - సర్వవ్యాపి అయిన సర్వేశ్వరునకు లోకం అంతా నివాసస్థానం అయినా, ఇక్కడ దివ్యమంగళవిగ్రహంతో ప్రకాశిస్తున్నందున ఇది విశేషమైన స్థానంగా చెప్పబడుతున్నది. ఇక్కడ వేంచేసి ఉండే నారాయణుడు యోగసాక్షాత్కారం కల్గినవారికి తన దర్శనాన్ని అనుగ్రహిస్తాడు. సకలప్రాణులు నిద్రించేటపుడు వారిని సంశ్లేషించి వారు పగటికాలంలో పొందిన శ్రమలను అన్నిటిని తీరుస్తాడు. తనను ఆశ్రయించినవారికి, మనస్సులో ఉంటూ సన్మార్గాన్ని చూపిస్తాడు. మరణించేటపుడు మరణావస్థను తగ్గిస్తాడు. మోక్షాన్ని పొందేవారికి సుషుమ్నానాడిని తెలిపి, దానిద్వారా వైకుంఠం చేరేటట్లు అనుగ్రహిస్తాడు.



ఈ విధంగా అతడు చేసే పలు ఉపకారాలను తలచి, అతని స్థానమైన ఈ హృదయ కమలాన్ని **"ఆయతనం మహత్"** (గొప్ప నివాసస్థానం) అని వేదం పొగడింది.

**(సంతతం... సన్నిభమ్)** - కొంచెం విచ్చుకొన్న తామరమొగ్గతో పోలిన ఆ హృదయం ఎల్లప్పుడు నరాలతో వేలాడుతూ ఉంటుంది. నరాలతో చక్కగా ఆవరింపబడినదై వేలాడతూ ఉంటుంది- అనే అర్థాన్ని కూడా గ్రహించవచ్చు.

**(ఆకోశసన్నిభమ్)** - కొంచెం వికసించిన తామరవంటిది. లక్ష్మీ వల్లభుడైనందున హృదయకమలాన్ని ఆదరించి అభిమానించాడు కాబోలు.

**(తస్యాంతే సుషిరం సూక్ష్మమ్)** - ఆ హృదయం నడుమ సూక్ష్మమైన ఒక ద్వారం ఉన్నది.

**(తస్మిన్ సర్వం ప్రతిష్ఠితమ్)** - అందులో సర్వాత్మ అయిన నారాయణుడు స్థిరంగా ఉన్నాడు. సర్వేశ్వరుడు సకలదోషాలకు స్థానమైన ఆ చోటును చాలా అభిమానించి వేంచేసి ఉండే ఈ మహాగుణాన్ని చూచి పరవశమై వేదం పల్కుతున్నది.

**(సర్వమ్)- "సర్వం సమాప్నోషి తతోసి సర్వః"** (అన్నిటిని వ్యాపించి ఉన్నావు. కనుక నీవు అన్నీ అవుతున్నావు) అని అర్జునుడు గీతలో పల్కిన రీతిలో సర్వాంతర్యామి అయినందున **"సర్వమ్"** అని చెప్పబడు తున్నాడు.

తరువాత, పురుషోత్తముడు హృదయంలో వేంచేసి ఉంటూ చేసే ఇంకొక ఉపకారాన్నిగూర్చి వేదం పల్కుతున్నది. **"అహం వైశ్వానరో**

భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః, ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్" (నేను జాఠరాగ్నికి అంతర్యామియై, ప్రాణుల దేహాన్ని ఆశ్రయించినవాడనై, ప్రాణాపానాలతో కూడినవాడనై, నాల్గు విధాలైన అన్నాలను పక్వం చేస్తాను) అని కదా గీతాచార్యుడు పలికాడు.

**(తస్య మధ్యే... విశ్వతో ముఖః)** - ఆ హృదయం మధ్యలో అంతటా వ్యాపించి ఉండేది, అంతటా జ్వాలలను కల్గినది అయిన గొప్ప అగ్ని (జఠరాగ్ని) ఉన్నది.

**(సోఽగ్రభుక్ విభజన్...)** అది ఆహారాన్ని మూడు విధాలుగా విభజించి, దానిని ముందుగా భుజిస్తున్నది. తాను దానిని జీర్ణం చేసిన తరువాత, దేహానికి అందిస్తున్నది- అని తాత్పర్యం.

**(అజరః)** ఎల్లప్పుడు ఈ అగ్ని జాగరూకమై ఉంటుంది.

**(సంతాపయతి స్వం దేహమ్ ఆపాదతలమస్తకమ్)** - అరికాలి నుండి తలవరకు దేహాన్ని ఇదే వేడిమిని కల్గి ఉండేటట్లు చేస్తుంది. ఆళ్వార్లు తిరుమలలోని కొండవాగులను, వృక్షాలను, చెట్లను, లతలను అనుభవించినట్లే, వేదం కూడా ఆదరాతిశయంతో అచ్యుతుని నివాసస్థానమైన హృదయంలో ఉండే ఈ అగ్నిని కూడా విస్తృతంగా అనుభవిస్తున్నవి.

**6.** తస్య మధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వావ్యవస్థితః ।
నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా ।
నీవారశూకవత్తన్వీ పీతాభాస్యాత్తనూపమా ॥

ఆ హృదయం మధ్యలో చాలా సూక్ష్మమైనది, ఊర్ధ్వముఖాన్ని కల్గినదిగా ఉండే వహ్నిశిఖ ఉన్నది. అది నీలమేఘాన్ని మధ్యలో కల్గిన మెఱపుతీగవలె కాంతితో, ధాన్యపుగింజ మొనవలె సూక్ష్మంగా, పసుపు పచ్చని వర్ణాన్ని కల్గినదిగా, సాటి లేనిదిగా ఉన్నది.



ఈ మంత్రానికి శ్రీనారాయణయతి అనుగ్రహించిన వ్యాఖ్యానం ఈడు ప్రమాణత్తిరట్టులో ప్రస్తావింపబడింది. ఈ మంత్రంలో ఉపాసింప బడేవాడైన నారాయణుని దివ్యమంగళవిగ్రహాన్ని వేదం వర్ణిస్తున్నది. దివ్యమంగళవిగ్రహమే ధ్యానించదగిన శుభాశ్రయం. భగవంతుని స్వరూపం శుభమైనది అయినా, ఇంద్రియాలకు అందనిది అయినందున ఆరాధ్యం- ఆరాధించడానికి వీలయినది - కాదు. బ్రహ్మాదుల శరీరాలు ఇంద్రియాలకు అందేవి అయినా అవి అశుభాలైనందున శుభాశ్రయాలు కావు. అందువల్ల భగవంతుని దివ్యమంగళవిగ్రహమే ఉపాసకులకు ధ్యానించదగిన శుభాశ్రయం- అని శ్రీభాష్యాదులలో నిర్ణయింపబడింది. అది ఇక్కడ వర్ణింపబడుతున్నది. వేదార్థ సంగ్రహంలో శ్రీభాష్యకారులు కూడా ఈ మంత్రార్థాన్ని సంగ్రహంగా అనుగ్రహించారు.

**(తస్య మధ్యే)** - **"దహరపుండరీకమధ్యస్థాకాశవర్తినీ"** (హృదయ కమలం నడుమ ఉండే ఆకాశంలో ఉండేది) అని శ్రీభాష్యకారులు పలికారు.

**(తస్య... వ్యవస్థితః)** - హృదయాకాశం మధ్యలో సూక్ష్మంగా ఊర్ధ్వముఖాన్ని కల్గినదిగా ఉండే వహ్నిశిఖ ఉన్నది.

**(వహ్నిశిఖా)- "ఉక్తమ్ తత్త్వజాత మాత్మతయా స్థిత్వా వహతి ధారయతీతి వహ్నిః - పరమాత్మా, తస్య శిఖా వహ్నిశిఖా"** (పూర్వం చెప్పబడిన తత్త్వసమూహాన్ని ఆత్మగా నిలచి వహిస్తున్నాడు కనుక వహ్ని అని పరమాత్మ చెప్పబడుతున్నాడు. అతని శిఖ వహ్నిశిఖ) అని నారాయణయతి వ్యాఖ్యానించారు. ముందు ప్రస్తావింపబడిన హృదయాన్ని,

జఠరాగ్ని మొదలైనవానిని అంతర్యామిగా నిలచి, ధరిస్తున్నాడు కనుక, వహ్ని అని పరమాత్మ చెప్పబడుతున్నాడు. అతనికి శిఖవలె ఉన్నందున దివ్యమంగళవిగ్రహం వహ్నిశిఖ అని చెప్పబడుతున్నది. వహ్నిశిఖ మిక్కిలి ప్రకాశాన్ని కల్గి ఉంటుంది. అదేవిధంగా పురుషోత్తముని విగ్రహంకూడా సాటి లేని ప్రకాశాన్ని కల్గినదై ఉంటుంది. అగ్నిశిఖ అగ్నిని విడచి ఉండకుండా, అది వెళ్ళే చోటుకు అంతటికి వెడుతుంది. ఆ విధంగానే, భగవానుని శరీరంకూడా భగవంతుని విడచి ఉండకుండా అతనికి వశమై ఉంటుంది. అందువల్ల అది శిఖ అని అనబడుతుంది. "వ్యవస్థితః" అనే పదంలోని పుంలింగం ఛాందసం.

**(నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా)-** ఆ దివ్యమంగళ విగ్రహం నీలమేఘాన్ని నడుమ కల్గిన మెఱపుతీగవలె కాంతితో ఉంటుంది. **"స్వాంతర్నిహితనీలతోయదాభపరమాత్మస్వరూపా స్వాంతర్నిహితనీలతోయదా విద్యుదివ ఆభాతీత్యర్థః"** (తనలో కల్గిన నీలమేఘంవంటి పరమాత్మయొక్క రూపాన్ని కల్గినదై, నీలమేఘాన్ని లోపల కల విద్యుల్లేఖవలె ప్రకాశిస్తున్నది - అని అర్థం.) అని శ్రీరామానుజులు వివరించారు.

ఇక్కడ స్వరూపశబ్దం రూపాన్ని తెల్పుతున్నది-అని శ్రుతప్రకాశికా చార్యులవారు వివరించారు. నీలమేఘంవంటి భగవంతుని దివ్యరూపాన్ని ఏవిధంగా విద్యుల్లతవంటిదని చెప్పవచ్చు? అంటే, లక్ష్మీదేవితో, శంఖచక్రాది దివ్యాయుధాలతో, పీతాంబరం మొదలైన ఆభరణాలతోను కూడి ఉండే తిరుమేనియొక్క కాంతి తిరుమేని వర్ణం కంటే మించి ఉన్నందున, దానిని 'నీలమేఘాన్ని లోపల కల్గిన విద్యుల్లత వంటి కాంతిని కల్గినది'' అని అనడంలో అడ్డు లేదు. తిరుమేని అనేది తెల్లదనం, నల్లని రంగు కలసి నెమలికంఠంవలె ప్రకాశిస్తున్నది - అని తాత్పర్యం. **"నీలతోయదమధ్యస్థా"** అనే పదం ఇక్కడ బహువ్రీహి సమాసంగా గ్రహించ దగినది. **"మధ్యస్థనీలతోయదా"** అని లేకపోవడం ఛాందసం. దీనిని తత్పురుషసమాసంగా గ్రహించి, ఇంకొక విధంగా కూడా అర్థాన్ని చెప్పవచ్చు.



**(నీలతోయదమధ్యస్థా.... భాస్వరా)-** నీలమేఘం నడుమ ఉండే విద్యుల్లతవంటి కాంతిని కల్గినది, భగవద్విగ్రహం- అని అర్థం. ఇపుడు తిరుమేనిలోని శ్యామళవర్ణం తిరుమేనికాంతి కంటే మించి ఉన్నదని తాత్పర్యం. ఈ అర్థాలను చూపే రీతిలో **"నీలముణ్ణ మిన్నన్న మేని పెరుమాన్"** (నల్లని మేఘం గ్రసించిన మెఱపువంటి మేనిని కల స్వామి) అని **"వేదమ్ తమిழ்శెయ్‌ద మాఅన్"** (వేదాన్ని ద్రావిడీకరించిన నమ్మాழ்వార్లు) వ్యక్తం చేసిన అందాన్ని ఏమని వర్ణించగలం! **"నీలముణ్ణ మిన్నన్న మేని"** అనే ప్రయోగం ద్వారా "నీలమేఘాన్ని మింగిన మెఱపువంటి తిరుమేని'' అని, "నీలమేఘం మింగిన విద్యుల్లతవంటి తిరుమేని'' అని ఈవిధంగా రెండర్థాలు వ్యక్తం కావడం గమనించవచ్చు. మొదటి అర్థంలో భగవానుని తిరుమేనిలోని విద్యుద్వర్ణం ఎక్కువగా ఉంటుంది - అని, రెండవ అర్థంలో నలుపు ఎక్కువగా ఉంటుంది - అని ఏర్పడుతున్నది. ఈ విధంగా రెండు రీతులలో ఏవిధంగా ఉండడం సాధ్యం? అనే సందేహం కలుగవచ్చు. దీనికి సమాధానాన్ని లక్ష్మీదేవిని విశ్లేషించి ఉండేటపుడు **"కరుముకిలొప్పర్"** (నల్లని మేఘంవంటివాడు) అనే రీతిలో కదా ఉంటాడు - అని పరమరసికులైన పెరియవాచ్చాన్‌పిళ్ళై పలికారు. చేతనలాభ, అలాభలే కదా భగవంతునకు లాభ, అలాభాలై ఉంటాయి. ఈ చేతనుని పొందలేనపుడు పురుషోత్తముని దేహం తెల్లగా పాలిపోయి ఉంటుందని మొదటి అర్థం తెల్పుతున్నది. చేతనుని పొందినపుడు ఏర్పడే

సహజమైన నీలమేఘశ్యామల వర్ణాన్ని రెండవ అర్థం తెల్పుతున్నది.

**(నీవారశూకవత్తన్వీ)-** ధాన్యపుగింజ మొనవలె సూక్ష్మమై ఉంటుంది, ఈ దివ్యమంగళవిగ్రహం.

**(పీతాభా)-** పసుపు పచ్చని రంగును కల కాంతితో కూడినది. కరగించిన బంగారంవలె ప్రకాశించేది. దేహవర్ణంకంటే కాంతియే అధికంగా ఉంటుంది - అని తాత్పర్యం. **"తేజసాం రాశిమ్"** (తేజస్సుల రాశి) అని కదా చెప్పబడింది. **"హిరణ్యవర్ణామ్"** (బంగారంవంటి వర్ణాన్ని కల్గినది) అని శ్రీసూక్తంలో చెప్పబడిన శ్రీదేవితోగల కలయిక వల్ల పసుపు రంగులో దివ్యమంగళవిగ్రహం ప్రకాశిస్తున్నది - అనే అర్థాన్ని గ్రహించవచ్చు. **"పీతాభా - ఎన్దదు స్వతేజస్సై విగ్రహన్దాన్ పానమ్ పణ్ణిక్కొణ్డిరుక్కుమ్బడి"** (పీతాభా-అంటే- తన తేజస్సును రూపం పానం చేస్తున్నది) అని నమ్పిళ్ళై అనుగ్రహించారు. **"పీతాభా"** అనేదానికి "స్వయం ప్రకాశమైనది'' అని రంగరామానుజ ముని వ్యాఖ్యానించారు.

**(తనూపమా స్యాత్)-** "ఈ విధంగా ఉండే శిఖ ఆ విగ్రహానికి ఉపమానం కావచ్చు'' అని నారాయణయతి వ్యాఖ్యానించారు. **"స్యాత్"** అని అన్నందున వాక్కుక్కు, మనస్సుకు అందని ప్రకాశాన్ని కల ఆ దివ్యమంగళ విగ్రహానికి ఇది కూడా సరి అయిన ఉపమానం కాలేదు- అనే అతృప్తిని వేదం చూపుతున్నది. **"దివి సూర్యసహస్రస్య భవేద్యుగ పదుత్థితా, యది భా స్సదృశీ సా స్యాత్ భాస స్తస్య మహాత్మనః"** (వేయి సూర్యుల కాంతి ఒకే సమయంలో ఆకాశంలో ప్రకాశిస్తే, అది ఆ మహాత్ముని కాంతికి సమానం కావచ్చు) అని కదా చెప్పబడింది.

**(తనూపమా)** - ఉపమానం లేనిది - అనే అర్థాన్ని కూడా గ్రహించవచ్చు. అపుడు **"స్యాత్"** అనే దానికి "ఉన్నది'' అనే అర్థాన్ని చెప్పాలి. ఈ అర్థాన్ని ఆళ్వార్లు **"కట్టురైక్కిల్ తామరై నిన్ కణ్పాదమ్ కైయొవ్వా, శుట్టురైత్త నన్ పొన్ ఉన్ తిరుమేని ఒళి ఒవ్వాదు"** (వివరించి పల్కితే తామరపూవు నీ నేత్రాలకు, పాదాలకు సాటి రాదు. కాచి వడపోసిన బంగారం కూడా నీ తిరుమేని వర్ణానికి సాటి రాదు) అని పలికారు.



8. తస్యాః శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః ।
స బ్రహ్మ స శివః సేంద్రః సోఽక్షరః పరమ స్స్వరాట్ ॥

ఆ శిఖ (దివ్యమంగళ విగ్రహం) నడుమ పరమాత్మ వేంచేసి ఉన్నాడు. అతడు బ్రహ్మకు అంతర్యామి, శివునకు అంతర్యామి, అతడు ఇంద్రునకు అంతర్యామి. అతడు కర్మకు వశుడు కానివాడు, గొప్పవాడైన ముక్తాత్మకు కూడా అంతర్యామి,

**(తస్యాః శిఖాయాః)** - ఆ దివ్యంగళ విగ్రహం నడుమ పరమాత్మ వేంచేసి ఉన్నాడు.

**(పరమాత్మా)** - "ఆత్మా నారాయణః'' అని చెప్పబడిన నారాయణుడు.

**(వ్యవస్థితః)** - విశేషేణ వ్యవస్థితః - విశేషంగా వేంచేసి ఉన్నాడు. వాత్సల్యం మొదలైన గుణాలను వ్యక్తం చేస్తూ వేంచేసి ఉన్నాడు. కర్మఫలానికి కట్టుబడనివాడుగా ఉన్నాడు. **"ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే, తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్నన్యో అభిచాకశీతి"** (అందమైన రెక్కను (జ్ఞానాన్ని) కల్గినవి, ఒకే గుణాన్ని కల్గినవి అయిన రెండు పక్షులు (జీవాత్మ-పరమాత్మలు ఒకే వృక్షంలో (దేహంలో) చేరి ఉన్నారు. వాటిలో ఒక పక్షి (జీవుడు)

పండిన పండును (కర్మఫలాన్ని) భుజిస్తున్నది. ఇంకొక పక్షి (పరమాత్మ) ఆ పండును భుజించకుండా ప్రకాశిస్తున్నది) అని కదా వేదం పల్కింది.

**(వ్యవస్థితః) -"ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేర్జున! తిష్ఠతి, భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా"** (అర్జునా! సర్వేశ్వరుడు అన్ని జీవరాసుల హృదయప్రదేశాలలో నిలచి ఉంటూ, ప్రకృతి అనే యంత్రంలో ఉండే ఆ జీవులను సత్త్వరజస్తమోగుణాలనే మాయతో పరిభ్రమింపజేస్తూ ఉన్నాడు) అని గీతలో పల్కినట్లు చేతనులను నియమించడంవల్ల కలిగే కాంతితో వేంచేసి ఉంటాడు- అనే అర్థాన్ని కూడా చెప్పవచ్చు.

**(వ్యవస్థితః)-** ఇది ఉపాసన ప్రకరణం కనుక చేతనాలాభంవల్ల కాంతిని పొంది వెల్గుతూ వేంచేసి ఉన్నాడని కూడా అర్థాన్ని గ్రహించవచ్చు.

అనంతరం, లోకంలో జ్ఞానశక్తులు అధికంగా కల్గినవారైన బ్రహ్మరుద్రేంద్రాదులు, ముక్తాత్మ ఈ పరమాత్మయొక్క విభూతులే- అని తెలుపబడుతున్నది.

**(స బ్రహ్మ...)** ఆ పురుషోత్తముడే బ్రహ్మకుకూడా అంతర్యామి; అతడు శివునకు కూడా అంతర్యామి, ఇంద్రునకు సైతం అంతర్యామి. అతడు వీరికంటే గొప్పవాడు, కర్మకు వశం కానివాడైన ముక్తాత్మకు కూడా అంతర్యామి. ఈ అర్థాన్ని **"అవనే అవనుమ్ అవనుమ్ అవనుమ్, అవనే మ*ఱ్ఱె*ల్లాముమ్ అఱివ్వనమే"** (అతడే బ్రహ్మకు, రుద్రునకు, ఇంద్రునకు అంతర్యామి. అతడే మిగిలినది అంతా- అని తెలిసికొన్నాము కదా!) అని ఆ*ళ్వా*ర్లు పలికారు. అక్కడ వేదంలో **"సః సః"** అని పఠించినట్లుగా ఆ*ళ్వా*ర్లు కూడా **"అవన్, అవన్"** అని అనడం కూడా



గమనించవచ్చు. ఆళవన్దార్ ఈ వాక్యాన్ని **"బ్రహ్మ శివ శ్శతమఖః పరమస్వరాడిత్యేతేపి యస్య మహిమార్ణవ విపుషస్తే"** (బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు, ముక్తాత్మ అనబడేవారుకూడా నీ ఐశ్వర్యమనే మహా సముద్రంలో చిన్న తుంపురులువంటివారు) అని వివరించారు. ఇక్కడ, అందఱిచేత జీవులుగా అంగీకరింపబడిన ఇంద్రునితో ముక్తాత్మతో, బ్రహ్మను, శివుని కూడా కలిగి పఠించినందున వారుకూడా జీవులే - అని తెలుపబడుతున్నది - అని పరమకారుణికులైన పెరియ వాచ్చాన్ పిళ్ళై స్తోత్రరత్నవ్యాఖ్యానంలో అన్నారు.

**(స బ్రహ్మ)** - జగత్సృష్టిని చేసేవాడుగా ప్రసిద్ధుడైన ఆ బ్రహ్మకూడా అతడే. అంటే - అతడు అంతర్యామిగా ఉన్నందున తన సత్తను పొందినవాడు, బ్రహ్మ - అని తాత్పర్యం. సర్వేశ్వరుడు బ్రహ్మకు అంతర్యామియై ఉండి జగత్సృష్టిని చేస్తున్నాడు. పరమాత్మ అయిన నారాయణునకు కూర్చుని సృష్టించే ఆసనంవంటివాడే బ్రహ్మ. మహాన్, అహంకారం, పంచభూతాలు, మొదలైన అచేతనాలను శరీరంగా కల్గి, సృష్టించినట్లుగానే బ్రహ్మను శరీరంగా కల్గి సృష్టిస్తున్నాడు. శరీరాన్ని తెలిపే పదాలు ఆత్మను కూడా బోధిస్తున్నాయి- అనే దానిని మనం వేదంలో, లోకంలో కూడా చూస్తున్నాము. ఆ న్యాయంతో ఇక్కడ **"బ్రహ్మ"** అనే పదం బ్రహ్మను శరీరంగా కల్గిన నారాయణుని చూపుతున్నది. **"స బ్రహ్మ"** అనేదానివల్ల ఈ హృదయకమలంలో నివసించేవాడే బ్రహ్మను శరీరంగా కలవాడు- అనే అర్థం స్ఫురిస్తుంది.

**(స శివః)-** శివుడుకూడా అతడే. సంహారం చేసేవాడైన శివునకు కూడా అతడే అంతర్యామి. **"శివమచ్యుతమ్"** అనే చోట శివపదం మంగళరూపుడనే అర్థాన్ని ఇస్తున్నది. కనుక, అచ్యుతుడనే తెల్పుతుంది-

అని చెప్పబడింది. ఇక్కడ శివునకు అంతర్యామి అయిన నారాయణుని తెల్పుతుంది. "విష్ణురాత్మా భగవతః" (షడ్గుణాలు కల శివునకు విష్ణువు ఆత్మ) అని కదా మహాభారతంలో తెలుపబడింది.

**(స బ్రహ్మ స శివః) - "శివనాయ్ అయనానాయ్"** (శివునకు అంతర్యామియై, బ్రహ్మకు అంతర్యామియై) అని ఆళ్వార్లు కూడా అన్నారు.

**(సేంద్రః)-** దేవతలకు నాథుడైన ఇంద్రునకు కూడా అతడే అంతర్యామి,

**(సోక్షరః...)-** వీరికంటే గొప్పవాడైన ముక్తాత్మకుకూడా అతడే అంతర్యామి.

**(పరమః)-** బ్రహ్మరుద్రాదులకంటే గొప్పవాడు ముక్తాత్మ. దీనికి గల కారణాన్ని 'స్వరాట్" అనే పదం తెల్పుతున్నది.

**(స్వరాట్)-** కర్మకు వశుడు కానివాడు- అని అర్థం. బ్రహ్మ, శివుడు మొదలైనవారు కర్మకు వశులు. ఇతడు ఆ విధంగా కర్మవశ్యుడు కాడు.

**(స్వరాట్) "స్వః స్వరాట్ భవతి"** (అతడు స్వతంత్రుడవుతాడు) అని వేదంలో పఠింపబడిన ముక్తాత్మను ఈ పదం స్మరింపజేస్తుంది. ఇక్కడ **"స్వరాట్"** అనే పదానికి "కర్మకు వశుడు కానివాడు'' అనే అర్థాన్నే గ్రహించాలి. ఈశ్వరపారతంత్ర్యం ఆత్మకు స్వరూపప్రయుక్తమైనది కనుక, అది ఇక్కడ నిషేధింపబడుతున్నదని భావించరాదు.

**(అక్షరః) -** ముక్తాత్మ జ్ఞానంలో సంకోచవికాసాలను లేనివాడు. ఇందువల్ల బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు - అని ప్రసిద్ధి పొందినవారు, వారికంటే గొప్పవాడైన ముక్తాత్మ భగవానుని విభూతులే - అని



చెప్పబడింది. భగవద్గీతలో భగవానుని విభూతిని (ఐశ్వర్యాన్ని) వర్ణించే అధ్యాయంలో **"రుద్రాణాం శంకర శ్చాస్మి"** (రుద్రులలో నేను శంకరుడను) అని, **"దేవానా మస్మి వాసవః"** (దేవతలలో ఇంద్రుడను) అని మొదలైన శ్లోకాలతో శ్రీకృష్ణుడు ఈ మంత్రార్థాన్ని వివరించాడు.

ఇక్కడ బ్రహ్మ, శివుడు మొదలైనవారికి, నారాయణునకు స్వరూపైక్యం చెప్పబడుతున్నదని కొందఱు భ్రమిస్తారు. ఆ విధంగా అర్థాన్ని గ్రహించడం అన్ని వేదాలకు, ఇతిహాసపురాణాలకు చాలా విరుద్ధం. **"విశ్వతః పరమమ్", "పరమం ప్రభుమ్", "పరమాత్మా"** అని మొదలైన, ఇక్కడ పఠింపబడిన శబ్దాలకు అది విరుద్ధమైనది. **"నారాయణాత్ బ్రహ్మా జాయతే, నారాయణాద్రుద్రో జాయతే, నారాయణాదింద్రో జాయతే"** (నారాయణుని వల్ల బ్రహ్మ జనిస్తున్నాడు, నారాయణుని వల్ల రుద్రుడు పుడుతున్నాడు, నారాయణుని వల్ల ఇంద్రుడు జన్మిస్తున్నాడు) అని మొదలైన వేదవాక్యాలవల్ల బ్రహ్మ-రుద్రేంద్రాదులుగా నారాయణునివల్ల సృష్టింపబడినవారని స్పష్టంగా తెలుస్తున్నది. ఆ విధంగా ఉండగా, వారికి ఏ విధంగా స్వరూపైక్యం చెప్పడానికి సాధ్యం? అంతేకాక, **"ఏకో హ వై నారాయణ ఆసీత్, న బ్రహ్మా నేశానః"** (ప్రళయసమయంలో నారాయణు డొకడే ఉన్నాడు కదా! బ్రహ్మ లేడు, శివుడు లేడు) అనే ఉపనిషద్వాక్యంతో కూడా విరోధిస్తుంది. చేతనులు, అచేతనం, ఈశ్వరుడు - అనే ముగ్గురి మధ్య పరస్పర భేదాన్ని పలికే పలుకులు వేదవాక్యాలు అబద్ధాలే కాగలవు. చేతనాచేతనాలకు అచ్యుతుడే అంతర్యామి - అని పలికే వేలాది ప్రమాణాలు అర్థరహితాలవుతాయి.

బ్రహ్మ అయితే వేదాలను కోల్పోయి "నేత్రాలను కోల్పోయాను, ధనాన్ని కోల్పోయాను'' అని కేశవుని వద్ద కన్నీరు విడచి, ఆక్రందించి,

అతనివల్ల వేదాలను తిరిగి పొందాడు. పురారి కూడా భస్మాసురుని వల్ల కలిగిన భయంతో పరుగెత్తి, పరంధాముని పాదాలలో పడి, ఆ పెద్ద ఆపద నుండి బయటపడ్డాడు. రావణుడు, మహాబలి, నరకాసురుడు మొదలైనవారిచే బాధను పొందిన ఇంద్రుడుకూడా హృషీకేశుని శరణు పొంది, ఆ ఆపదలను తీర్చుకొన్నాడు. ఈ రీతిలో రక్షకుడుగా ప్రసిద్ధి పొందిన పరమపురుషునకు, అతనిచే రక్షింపబడే బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు మొదలైనవారికి ఐక్యం చెప్పడం సాధ్యమా?

కర్మకు వశులయేవారైన బ్రహ్మరుద్రేంద్రాదులు, కర్మకు కట్టుబడని కేశవుడు, అందరూ ఒకరే - అని చెప్ప వీలున్నదా? **"మహాదేవ స్సర్వమేధే మహాత్మా హుత్వాత్మానం దేవదేవో బభూవ"** (మహాత్ముడైన మహాదేవుడు సర్వమేధయాగంలో తనను కూడా హోమం చేసికొని దేవదేవుడయ్యాడు). అని భారతంలో చెప్పబడింది. జన్మించేటపుడే శివుడు **"అనపహతపాప్మా వాహమ్"** (నేను పాపాలు తీరనివాడనై ఉన్నాను) అని బ్రహ్మవద్ద మొఱపెట్టాడని వేదం పల్కింది. శ్రీరామాయణంలో బ్రహ్మ, శివుని దేవతలకు ప్రభువుగా నియమించినట్లు చెప్పబడింది. స్వరూపైక్యాన్ని పలికే పక్షంలో ఇవి ఏమీ పొసగవు.

రుద్రుడు విష్ణువును యుద్ధంలో ఎదిరించి ఆ పురుషోత్తముని హుంకారంతో మూర్ఛను పొందిన వృత్తాంతం శ్రీరామాయణంలో విస్తృతంగా చెప్పబడింది. బాణాసుర యుద్ధంలో పరంధామునిచే ప్రహరింపబడి, వెన్ను చూపి పారిపోయి, ఫాలనేత్రాన్ని తడుముకొని, బాణుని నిస్సహాయునిగా వదలిపెట్టిన వృత్తాంతం శ్రీవిష్ణుపురాణంలో, శ్రీభాగవతంలో విస్తృతంగా గమనించవచ్చు. ఇంద్రుడుకూడా గోవర్ధనధారి అయిన గోపాలునివల్ల సర్వభంగాన్ని పొందిన కథ కీర్తిని పొందినదే.



నరకాసురుని వధించిన ఉపకారాన్ని కూడా స్మరించకుండా, ఒక పూలచెట్టును ఇవ్వడానికి కూడా ఒప్పుకోకుండా, శ్రీకృష్ణునితో యుద్ధం చేసి, ఓడి పారిపోయాడు కదా, దేవేంద్రుడు. జయింపబడినవారికి, జయించినవారికి ఐక్యం పల్కడం ఏరీతిలో పొసగతుంది?

పురుషోత్తముడు త్రివిక్రమావతారాన్ని ఎత్తి లోకాన్ని అంతటిని రెండు శ్రీచరణాలతో కొలిచినపుడు బ్రహ్మ ఆ స్వామి పాదకమలాన్ని తన కమండలుజలంతో అభిషేకించాడు. ఆ కమండలుజలాన్ని తన పాపాలు తీరడం కోసం తన శిరస్సుపై త్రిపురారి ధరించాడు. శ్రీచరణాలు కడుగబడినవాడు, ఆ పాదాలను కడిగినవాడు, శ్రీచరణాలను కడిగిన జలాన్ని తలపై ధరించినవాడు- అందఱూ ఒకటే- అని వివేకులెవరైనా అంటారా? **"యస్య ప్రసాదాదహ మచ్యుతస్య భూతః ప్రజాసృష్టి కరోంతకరీ క్రోధాచ్చ రుద్రః"** (ఏవిష్ణువు యొక్క అనుగ్రహం వల్లనేను ప్రజాసృష్టిని చేస్తున్నానో, ఎవని క్రోధాంశం చేత రుద్రుడు సంహరిస్తున్నాడో) అని బ్రహ్మచే చెప్పబడింది. బాణాసురయుద్ధం చివరలో **"ఈశ్వరోహమ్"** అనే రుద్రుడుకూడా **"వయం చ సర్వే భవతానుభావితా విభావయామో భువనాని సప్త"** (మేమంతా నీచే రక్షింపబడేవారమై, ఏడు లోకాలను కాపాడుతున్నాము) అని, **"అహం బ్రహ్మా చ విబుధా మునయ శ్చామలాశయాః, సర్వాత్మనా ప్రపన్నా స్త్వామ్"** (నేను, బ్రహ్మ, దేవతలు, సాత్త్వికులైన మునులు నిన్ను అన్ని విధాలుగా శరణు పొందాము) అని వాసుదేవునే స్తోత్రం చేశాడు. స్తోత్రం చేయబడేవాడు, స్తుతించే ఒకడే అని ఏవిధంగా చెప్పడం సాధ్యం? శరణు పొందేవారికి, శరణ్యునకు ఐక్యం ఎక్కడైనా సిద్ధిస్తుందా? దీనిని ఇంకా విస్తృతంగా పల్కితే ఒక మహాభారతమే కాగలదు. ఇంతేకాక, **"విశ్వతః పరమమ్"** అనేచోట, **"విశ్వమ్"** అనేచోట, **"విశ్వమేవేదం పురుషః"** అనేచోట వ్యాఖ్యానించడంలో

ఈ విధంగా విభక్తిలో సర్వేశ్వరుని, మిగిలినవారిని నిర్దేశించడానికి కారణం శరీరాత్మభావమే - అని పలు ప్రమాణాలను చూపి నిరూపించాము- అని కూడా ఇక్కడ అనుసంధేయాలు.

ఈ నారాయణసూక్తాన్ని అంతటిని కటాక్షించి, శ్రీకూరేశులు శ్రీవైకుంఠస్తవంలో ఒక శ్లోకాన్ని అనుగ్రహించారు. దాని అందాన్ని ఏమని పొగడాలి? **"ఆత్మేశ్వరోసి న పరోస్తి తవేశ్వరోన్యః, విశ్వస్య చాధిపతి రస్య పరాయణం చ, నారాయణాచ్యుత! పరస్త్వ మిహైక ఏవ, బ్రహ్మాదయోపి భవదీక్షణలబ్ధసత్తాః"** (నారాయణా! అచ్యుతా! నీవు ఆత్మేశ్వరుడవై ఉన్నావు. నీకు మించిన వేఱొక ఈశ్వరుడెవడూ లేడు. లోకానికి అంతటికి అధిపతివి నీవే. దీనికి గొప్ప ఉపాయంగా కూడా ఉన్నావు. ఇక్కడ నీవొక్కడవే గొప్పవాడవు. బ్రహ్మమొదలైనవారుకూడా నీకటాక్షంవల్ల సత్తను పొందారు) అనేది ఆ శ్లోకం. ఈ సూక్తంలో మాటిమాటికి పఠింపబడే నారాయణశబ్దాన్ని **"నారాయణ!"** అని కూరేశులు అనుసంధించారు. **"అచ్యుతమ్"** అనేదానిని దృష్టిలో పెట్టుకొని **"అచ్యుత"** అని సంబోధించారు. **"ఆత్మేశ్వరమ్"** అనేదాని అర్థాన్ని **"ఆత్మేశ్వరోసి న పరోస్తి తవేశ్వరోన్యః"** (ఆత్మేశ్వరుడవై ఉన్నావు, నీకు మించిన ఈశ్వరుడు ఇంకొకడు లేడు) అని వివరించారు. **"పతిం విశ్వస్య"** అనే ప్రయోగాన్ని **"విశ్వస్య చాధిపతిః"** అని వివరించారు. **'పరాయణమ్"** అనే పదాన్ని **"అస్య పరాయణం చ"** అని అనుభవించారు. **"పరం బ్రహ్మ, పరతత్త్వమ్, పరంజ్యోతిః, పరమాత్మా, విశ్వతః పరమమ్"** అనే పదాలను అన్నిటిని దృష్టిలో పెట్టుకొని **"పరః త్వమిహ ఏక ఏవ"** (ఇక్కడ నొక్కడవే పరవస్తువు) అని అన్నారు. **"స బ్రహ్మ స శివః సేంద్రః సోక్షరః పరమః స్వరాట్"** (అనే వాక్యాన్ని కటాక్షించి **"బ్రహ్మాదయోపి భవదీక్షణ లబ్ధసత్తాః"** (బ్రహ్మమొదలైనవారు కూడా నీ కటాక్షంవల్ల సత్తను పొందారు) అని



అన్నారు. ఈ రీతిలో శ్రుత్యర్థాలను అందమైన శ్లోకాల రూపంగా పల్కడంలో కూరేశులు ఎవరూ సాటి రారు. ఇందువల్లనే కదా వీరు **"యదుక్తయ స్త్రయీకంఠే యాంతి మంగళసూత్రామ్"** (కూరేశుల శ్రీసూక్తులు వేదకాంతకంఠంలోని మంగళసూత్రమై ఉండే స్వభావాన్ని పొందాయి) అని వారి కుమారులైన భట్టర్ పొగడారు.

**8. ఋతం సత్యం పరం బ్రహ్మ పురుషం కృష్ణపింగళమ్।
ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయ వై నమః॥**

సర్వవ్యాపి అయినవాడుగా, వికారరహితుడుగా, పరబ్రహ్మమై, పురుషుడనే పేరును కలవాడై ఉండేవాడుగా, నల్లని రంగు, పసుపు పచ్చని రంగు కలసిన వర్ణాన్ని కలవాడుగా, గొప్ప వీర్యాన్ని కలవాడుగా, విరూపాన్ని పొందిన (మార్పును పొందిన) గుణాలను నేత్రాలను కలవాడుగా, లోకాన్ని అంతటిని శరీరంగా- రూపకంగా కలవాడుగా ఉండే పరమాత్మకు నమస్కారం.

ఇది నారాయణవల్లిలోని పన్నెండవ అనువాకంలోని మంత్రం. దీనితో నారాయణసూక్తం పూర్తి అవుతుంది. ముందు అనువాకంలో పరమాత్మ నారాయణుడే - అని నిర్ణయించి, అతని స్వరూపరూపగుణ విభూతులు వివరింపబడ్డాయి. ఇక్కడ పరమపురుషార్థమైన కైంకర్యం ప్రార్థింపబడుతున్నది. పురుషసూక్తంలో కూడా ఉత్తరానువాకం చివరలో కైంకర్యం ప్రార్థింపబడింది కదా !

**(ఋతమ్) - "ఋ-గతౌ"** అనే ధాతువునుండి పుట్టిన ఈ పదం వల్ల సర్వగతుడనే అర్థం వస్తుంది. **"విశ్వాత్మానమ్"** అని, **"అంతర్బహిశ్చ... నారాయణః స్థితః"** అని చెప్పబడిన సర్వవ్యాపిత్వాన్ని ఆదరాతిశయం వల్ల మళ్ళీ వేదం అనుసంధిస్తున్నది, ఈ అనువాకంలో **"తతో విష్వఙ్

వ్య(క్రామత్" అని పురుషసూక్తంలో చెప్పబడినట్లుగా అవతారాలు ఎత్తి, అంతటా వ్యాపించి ఉండేవాడనే అర్థాన్ని గ్రహించవచ్చు. ఇతనికి కైంకర్యం చేయడంకోసం మనం చాలా దూరం వెళ్ళనక్కరలేదు. అతడు సర్వవ్యాపి అయినందున మనం ఉండే చోటనే ఇతనికి కైంకర్యం చేయవచ్చు- అని వేదం తెల్పుతున్నది.

**(సత్యమ్)**- **"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ"** అనే వేదవాక్యాన్ని ఇది స్మరింపజేస్తున్నది.

**(సత్యమ్)** - **"అక్షరమ్"** అనేచోట చెప్పబడిన రీతిలో స్వరూపంలో, స్వభావంలోను ఏ వికారం లేకుండా, ఏకరూపుడై ఉండేవాడు. తత్త్వాలన్నిటిలోను గొప్ప తత్త్వమై ఉండేవాడు.

**(సత్యమ్)**- ఆశ్రితరక్షణమనే ధర్మంలో ఏకరూపుడై ఉండేవాడనే అర్థాన్ని కూడా గ్రహించవచ్చు. **"అవ్యవస్థితచిత్తానాం ప్రసాదోపి భయంకరః"** (చంచలబుద్ధిని కలవారి అనుగ్రహంకూడా భయాన్ని కల్గించేదే) అని చెప్పబడిన రీతిలో అన్యదేవతలు చంచలమైన మనస్సును కలవారై నందున వారిని ఆశ్రయించడం కూడా అనర్థాన్ని కల్గించేదే. ఇతడు ఆ విధంగా కాకుండా, ఆశ్రితరక్షణలో ఏకరూపుడై ఉండేవాడు కనుక ఇతని విషయంలో చేసే కైంకర్యం వ్యర్థం కాబోదు - అని తెలుపబడింది.

**(పరం బ్రహ్మ)** - స్వరూపరూపగుణ విభూతులలో చాలా గొప్పవాడైనందున, తనను ఆశ్రయించినవారిని తనవలె గొప్పగా చేసేవాడైనందున ఇతనికి కైంకర్యం చేయుడమే తగినది- అని తెల్పుతున్నది.

**(పురుషమ్)**- **"పురుష"**డనే పేరును కలవాడని అర్థం. **"స్త్రీప్రాయ మితరత్ సర్వమ్"** (మిగిలినది అంతా, పతికి పత్నివలె, నారాయణునకు పరతంత్రమైనది) అనేవిధంగా మనం అందఱు ఇతనికి పత్ని వంటివారం కనుక, ఇతడు మనకు పురుషుడు కనుక, ఇతనికి కైంకర్యం చేయడమే మన స్వరూపానికి తగినది - అని తెలుపబడింది.



**(కృష్ణపింగళమ్)** - నలుపు, పసుపుపచ్చ రంగులు కలసిన తిరుమేనిని కలవాడు. కైంకర్యానికి విషయమై ఉండే తిరుమేనిని ఇది తెల్పుతున్నది. కాలమేఘంతో పోలిన భగవానుని తిరుమేనిని శ్రీసుదర్శనుడు తన తేజస్సుతో వ్యాపించి ఉన్నందున **"కృష్ణపింగళమ్"** అని చెప్పబడిందని పెరియవాచ్చాన్‌పిళ్ళై తిరుప్పల్లాణ్డు వ్యాఖ్యానంలో పలికారు. ముందు (గడచిన) అనువాకంలో కూడా **"నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్కరా"** అని, **"పీతాభా"** అని చెప్పబడడం ఇక్కడ స్మరించదగినవి.

**"అతసీపుష్పసంకాశః పీతవాసా జనార్దనః, వ్యభ్రాజత సభామధ్యే హేమ్నీవోపహితో మణిః"** (అగిసెపూవు వన్నెవంటి వర్ణాన్ని కలవాడు, పీతాంబరాన్ని ధరించినవాడైన జనార్దనుడు, బంగారంలో పొదిగిన నీలమణివలె, సభామధ్యంలో ప్రకాశించాడు) అని మహాభారతంలో చెప్పబడినట్లుగా పీతాంబరం చేరికవల్ల పసుపురంగు, నల్లని రంగు కలసిన వర్ణాన్ని కలవాడవుతున్నాడనే అర్థాన్ని గ్రహించవచ్చు. శ్రీరామాయణంలో కూడా శ్రీరాముని గూర్చి **"మేఘశ్యామమ్"** అని, **"హేమసమానవర్ణమ్"** (బంగారంతో పోలిన వర్ణాన్ని కలవాడు) అని వర్ణింపబడింది కదా! భగవానుని వర్ణం నెమలికంఠం రంగువలె పసుపుపచ్చ, నలుపు కలసినది- అని యోగార్ణవంలోను, **"కృష్ణపింగళమ్"**

అని యోగయాజ్ఞవల్క్యంలోను పురుషోత్తముని గూర్చి చెప్పబడినందున, ఇది శ్రీమన్నారాయణుని రూపమే - అని నిశ్చయింపబడుతున్నది. **“ద్రుతకనకగిరిపరిమిళదుదధి ప్రచలితలహరివదహమహమికయా, స్నపయతి జన మిమ ముపహరతి తమః ఫణిశయమరకతమణి కిరణగణః”** (ఆదిశేషుడనే శయ్యపై పరుండి ఉండే శ్రీరంగనాథుడనే మరకతమణి యొక్క కాంతిప్రవాహం, కఱగిన బంగారపు కొండతో కూడిన సముద్రం నుండి వ్యాపించిన అలలవలె, “నేను ముందు నేను ముందు” అని ముందుకు వచ్చి, దాసుని అభిషేకిస్తున్నది. ఆంతరతమస్సును పోగొడుతున్నది) అని భట్టరు ఈ వర్ణకాంతిని అనుభవించారు. **“హిరణ్యవర్ణామ్”** (బంగారపురంగువంటి రంగును కల్గినది) అని చెప్పబడిన లక్ష్మీదేవియొక్క కలయికచేత **“కృష్ణపింగళమ్”** అని చెప్పబడుతున్నదనికూడా గ్రహించవచ్చు. ఇందువల్ల భగవానుడు, లక్ష్మీదేవుల కలయికలోనే కైంకర్యం చేయాలి- అని తెలుపబడింది. పురుషసూక్తంలో కూడా **“హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ”** (భూదేవి, లక్ష్మీదేవి నీకు పత్నులు) అని ఈ చేరికలోనే కైంకర్యప్రార్థన చేయబడింది కదా ! భగవానుడు, లక్ష్మీదేవి కలసి ఉండే ఈ చేరిక ప్రాకృతుల సంశ్లేషంవంటిది కాదు- అని ఇకపై తెలుపబడుత్నుది.

**(ఊర్ధ్వరేతమ్)**- ప్రాకృతమైన స్త్రీ సంబంధాదులను లేనివాడని తాత్పర్యం. **“కుర్వత్యాం తు తతః తస్యాం మండలం తత్ ప్రదక్షిణమ్, బ్రహ్మా విష్ణుశ్చ భగవాన్ తృణీకృత్యావతిష్ఠతామ్, ఇంద్రః స్థాణుశ్చ భగవాన్ ధైర్యం త్యక్త్వా వ్యవస్థితౌ”** (ఆ తిలోత్తమ మండలాన్ని ప్రదక్షిణం చేసినపుడు బ్రహ్మ, భగవానుడైన విష్ణువు, ఆమెను తృణంగా భావించి నిలచారు. ఇంద్రుడు, భగవానుడైన శివుడు మనోవికారాలను పొందారు) అని మహాభారతంలో చెప్పబడినది ఇక్కడ అనుసంధేయం. దారుకవనంలోని ఋషిపత్నులను చూచి మోహించిన శివుడు ఇక్కడ చెప్పబడే పరమాత్మ కాదు - అని దీనివల్ల తెలుస్తున్నది. భస్మాసురుని మోహింపజేయడంకోసం స్త్రీరూపాన్ని ధరించిన సర్వేశ్వరుని చూచి మోహించి వీర్యాన్ని విడచిన త్రినేత్రుడు ఏవిధంగా ఊర్ధ్వరేతసుడు కాగలడు? త్రినేత్రుడు, చతుర్ముఖుడు జితేంద్రియులు కారు - అనేదానిని వివరించడానికి ఇంకా ఎన్నో వృత్తాంతాలున్నాయి.



**(ఊర్ధ్వరేతమ్) - “రేతసస్సృష్టిః”** మొదలైన వేదవాక్యాలలో రేతశ్శబ్దం వికారాన్ని తెల్పుతున్నందున వికారాన్ని లేనివాడనే అర్థాన్ని కూడా చెప్పవచ్చు. గొప్ప వీర్యాన్ని కలవాడు- అనే అర్థాన్ని కూడా గ్రహించవచ్చు.

**(విరూపాక్షమ్)** - మార్పును పొందిన రూపాలను కల కన్నులను కలవాడు. **“విరూపాక్షు”**డనే పేరు శివునిది కదా! అందువల్ల ఇక్కడ ఇది రుద్రుని తెల్పుతున్నదిగా ఎందుకు గ్రహించకూడదు? అంతేకాక, విరూపాక్షుడనే పేరు పుండరీకాక్షునకు పొసగదు కదా!- అనే ప్రశ్నలిక్కడ కలుగవచ్చు. ఈ సూక్తంలో పఠింపబడ్డ నారాయణ, హరి, అచ్యుత, అనంతాది నామాలు శివునకు ఏమాత్రం పొసగవు. ఈ మంత్రంలో పఠింపబడ్డ **“పురుషమ్, పరంబ్రహ్మ, ఊర్ధ్వరేతమ్”** ఇత్యాది శబ్దాలు కూడా నారాయణుని తప్ప వేఱెవ్వరిని తెలుపవు. **“చక్షుషీ చంద్రసూర్యౌ”** (సూర్యచంద్రులు నేత్రాలు) అని ముండకోపనిషత్తులోను, **“అశ్వినౌ చాపి తే కర్ణౌ చంద్రసూర్యౌ చ చక్షుషీ”** (అశ్వినీదేవతలు నీ చెవులు, చంద్రసూర్యులు నీ నేత్రాలు) అని శ్రీరామాయణంలోను, **“చంద్రాదిత్యౌ చ చక్షుషీ”** అని మహాభారతంలోను పరమపురుషునిగూర్చి చెప్పబడినందున మార్పుపొందిన రూపాన్ని కల చంద్రుని, సూర్యుని నేత్రాలుగా కల కేశవుని ఇక్కడ **“విరూపాక్షమ్”** అని చెప్పబడినట్లు

గ్రహించాలి. వారాహపురాణంలో **"తస్య చింతయతో నేత్రాత్ తేజ స్సమభవన్మహత్, దక్షిణం వహ్నిసంకాశం వామం తు హిమసన్నిభమ్"** (ఆ విధంగా భావిస్తున్న భగవానుని కన్నులనుండి ఒక గొప్ప తేజస్సు ఉదయించింది. కుడికన్ను నిప్పువలె వెల్గింది. ఎడమ కన్ను మంచువలె ఉన్నది) అని చెప్పబడినట్లు ఒక కంటిలో చల్లదనాన్ని, ఇంకొక కంటిలో ఉష్ణాన్ని కల్గినవాడుగా ఉన్నందున విరూపాక్షుడని చెప్పబడినట్లుగా కూడా గ్రహించవచ్చు.

**(విరూపాక్షమ్)** - విశేషమైన రూపాన్ని కల కన్నులను కలవాడని కూడా అర్థాన్ని గ్రహించవచ్చు. **"యథా కప్యాసం పుండరీకమేవ మక్షిణీ"** (సూర్యునిచే వికసింపబడిన తామరలవంటివి, అతని రెండు కన్నులు) అనే వేదవాక్యం ఇక్కడ అనుసంధేయం. ఆళ్వార్లు కూడా **"వన్ కాఱ్ఱిఱైయ ఒరుజ్గే మఱిన్దు పొలిన్దన.... ఎమ్బిరాన తడమ్ కణ్గళే"** (భగవానుని విశాల నేత్రాలు - గొప్ప గాలికి కొంచెం వంగిన, తటాకంలోని తామర పూలవలె ఉన్నాయి) అని ఈ కన్నుల అందాన్ని తిరువిరుత్త ప్రబంధంలో వర్ణించారు. భక్తులను అనుగ్రహించడం వల్ల, శత్రువులను నిరసించడంవల్ల విరూపమైన నేత్రాలను కలవాడని కూడా గ్రహించవచ్చు.

**(విశ్వరూపాయ....)** లోకాన్ని అంతటిని తన శరీరంగా కలవానికి నమస్కారం. లోకాన్ని అంతటిని తనను శరీరంగా కల్గి, వాని సుఖదుఃఖాలను తనవిగా అభిమానిస్తున్నవాడైనందున ఇతనికి కైంకర్యం చేయడమే ఉచితమైనదని తెలుపబడింది. మన కాళ్ళు, చేతులు మొదలైన అంగాలు ఏ విధంగా మనకు శేషమై ఉంటాయో, ఆ విధంగానే ఇతనికి ఈ లోకం అంతా శేషమని దీనివల్ల తెలుపబడింది. శరీరికి శేషం కాని శరీరం ఉంటుందా? **"ఆయ"** అనే చతుర్థీవిభక్తిచే కైంకర్యం ప్రార్థింపబడుతున్నది. **"నమః"** అని అనడంవల్ల ఆ కైంకర్యం కూడా మన ఆనందంకోసం చేయబడేది కాదు; భగవానుని ముఖకమలవికాసంకోసమే చేయబడాలని